Hazrath Usman Ghani (R)
(Telugu)

ప్రియప్రవక్త (సఅసం) వారి నలుగురు ఆప్త మిత్రులు

## 3వ భాగం

# హజరత్ ఉస్మాన్ గని

## (రజి అల్లాహు అన్హు)

మూలం

**ఇర్ఫాన్ ఖలీలి**

అనువాదం

**అబ్బాదుల్లా**

قَالَ النَّبِيُّ صَلَّى اللّٰهُ عَلَيْهِ وَسَلَّمَ

# لِكُلِّ نَبِيٍّ رَفِيقٌ وَرَفِيقِي

# فِي الْجَنَّةِ عُثْمَانُ. (ترمذی)

మహాప్రవక్త (సఅసం) ఇలా ప్రవచించారు :

**ప్రతి ప్రవక్తకు ఉంటాడు ఒక ఆప్తుడు**

**స్వర్గంలో ఉస్మాన్ (రజి) నా మిత్రుడు.**

**(తిర్మిజి)**

అనంత కరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# హజరత్ ఉస్మాన్ గని

## (రజి అల్లాహు అన్హు)

## పేరు, వంశం

ప్రియప్రవక్త (సఅసం) తరువాత వచ్చిన ఖలీఫాలలో మూడవ ఖలీఫా అసలు పేరు ఉస్మాన్ (రజి). కునియత్ (తండ్రి తనయుల సంబంధం ప్రకారం) అబూ అబ్దుల్లాహ్ మరియు అబూ అమ్ర్. బిరుదు జున్నూరైన్. జున్నూరైన్ అంటే రెండు కాంతులవారు.

తండ్రి పేరు అఫ్ఫాన్. తల్లి పేరు అర్వా. అఫ్ఫాన్ ప్రియప్రవక్త (సఅసం)కు పిన తండ్రి అవుతారు. అర్వా ప్రియప్రవక్త (సఅసం) తండ్రిగారి చెల్లెలి కూతురు. అర్వా తల్లిగారు అయిన బైజాహ్, ప్రియప్రవక్త (సఅసం)గారి తండ్రి ఇరువురు కవలలు, అన్నాచెల్లెలు. హజరత్ ఉస్మాన్(రజి) గారి వంశం ఐదు తరాలు వెనుకకు వెళ్ళితే ప్రియప్రవక్త (సఅసం) వంశంతో కలుస్తుంది. ఖురైషు వంశంలో ఈ రెండు కుటుంబాలు సుప్రసిద్ధమైనవి. ఒకటి బనూ హాషిమ్, రెండు బనూ ఉమయ్యా.

ప్రియప్రవక్త (సఅసం) బనూ హాషిమ్ కుటుంబానికి చెందినవారు. హజరత్ ఉస్మాన్ (రజి) కుటుంబం బనూ ఉమయ్యాతో సంబంధం కలిగి ఉంది. బనూ హాషిమ్ కుటుంబం ఏ విధంగ సమాజంలో గౌరవమర్యాదలు కలిగి శక్తిసామర్థ్యాలు కలదిగా భావించబడేదో అదే విధంగా బనూ ఉమయ్యా కుటుంబం కూడ సమాజంలో గౌరవనీయంగా పరిగణించబడేది. ఖురైషు వంశీయుల జండా "అఖాన్" అనబడేది. ఈ జండా ఉమయ్యా కుటుంబీకుల వద్ద ఉండేది. అరబ్బులలో ఒక గొప్ప యుద్ధం జరిగింది. ఆ యుద్ధాన్ని

ఫుజ్జార్ యుద్ధం అంటారు. బనూ ఉమయ్య కుటుంబానికి చెందిన సుప్రసిద్ధ సర్దారు హరబ్ బిన్ ఉమయ్యా సైన్యానికి సేనాధిపతిగా ఈ యుద్ధంలో పాల్గొన్నారు.

## పుట్టుక, బాల్యం

అరబ్బు దేశంలో ఏనుగుల వారి సంఘటన జరిగిన ఆరు సంవత్సరాల తరువాత హజరత్ ఉస్మాన్ (రజి) జన్మించారు. ప్రియప్రవక్త (సఅసం) ఆ సంఘటన జరిగిన 40 దినముల తరువాత జన్మించారు. ఈ విధంగ చూచినట్లయితే హజరత్ ఉస్మాన్ (రజి) హజరత్ ముహమ్మద్ (సఅసం) కంటే ఆరు సంవత్సరాలు చిన్నవారు. ఆ కాలంలో మక్కా నగరంలో చదువు నేర్చుకొనే అలవాటు ఉండేదికాదు. విద్య అవసరం లేదని తలంచేవారు. అందువల్ల విద్యావంతుల సంఖ్య అతి తక్కువగ ఉండేది. అక్కడి ఈ సంప్రదాయానికి వ్యతిరేకంగ హజరత్ ఉస్మాన్ (రజి) విద్యార్జన పట్ల అమిత ఆసక్తి చూపారు. ఎంతో కృషి చేస్తూ చదవడం, వ్రాయడం ప్రారంభించారు. క్రమంగ ఆయన చదువుకొన్న వారిలో లెక్కించబడ్డారు. కష్టేఫలి అన్నారు పెద్దలు. విద్యార్జన కోసం చేసిన కృషి ఫలించింది.

తండ్రిగారు ధనవంతుడు. అందువలన ఈయన బాల్యం సుఖసౌఖ్యాలతో ఆడంబరంగ గడిచింది. బాల్యం నుండే హజరత్ ఉస్మాన్(రజి) సద్గుణ సంపన్నుడు. సత్యశీలుడు, విశ్వాసపాత్రుడు. పరులకు సహాయపడే వారు. చెడు సాంగత్యం ఆయనకు గిట్టేదికాదు. అలాంటి వారికి ఆమడ దూరాన ఉండేవారు. అదే విధంగ ఉస్మాన్ (రజి) స్నేహితులు కూడా మంచివారు. నమ్మకంతో మెలిగేవారు.

## యౌవనం ఎలా గడిచింది?

హజరత్ ఉస్మాన్ (రజి) యౌవనానికి వచ్చారు. ఉదరపోషణార్థం అక్కడి సంప్రదాయం ప్రకారం వ్యాపార వృత్తి స్వీకరించారు. చేసిన కృషి, పాటించిన సత్యశీలత, చూపిన విశ్వాసం, నమ్మకాల వల్ల ఆయనకు

వ్యాపారం బాగుగ రాణించింది. కొంత కాలానికే ఎంతో అభివృద్ధి సాధించారు, మక్కా నగరపు బడా వ్యాపారులలో ఒకరుగ పేరు పొందారు.

ప్రారంభం నుండే హజరత్ ఉస్మాన్ (రజి) సత్ప్రవర్తన కలవారు. మద్యపానం, జూదం లాంటి రుగ్మతలకు దూరంగ ఉండేవారు. విగ్రహారాధన అంటే కూడా ఆయనకు ఇష్టంలేదు. అటువంటి అలవాట్లకు లోనయినవారిని చూసి మనస్సులో బాధపడేవారు.

అల్లాహ్ హజరత్ ఉస్మాన్ (రజి)కు ఎంతో ఐశ్వర్యమిచ్చాడు. అయినప్పటికీ ఆయనకు ఏమాత్రం గర్వం ఉండేదికాదు. ఇతరుల మాదిరిగానే ఆయన సాధారణ జీవితం గడిపేవారు. ఆపద్బాంధవునిగ లేమిననుభవించేవారికి సహాయపడేవారు. పరుల కష్టాలు తీరుస్తూ రుణగ్రస్తుడు రుణాన్ని తీర్చి సంతోషపడినట్లు ఆనందపడేవారు. అందువల్లనే మక్కావాసులు ఆయన్ను 'గని' (ధనవంతుడని) అనేవారు. ఇదే పేరుతో ఆయన వాసికెక్కారు. హజరత్ ఉస్మాన్ (రజి) సిగ్గు బిడియం గల వ్యక్తి. సిగ్గుమాలిన పనులకు, అశ్లీల సాంగత్యానికి బహుదూరంగ ఉండేవారు.

## ఆయన (రజి) ముస్లిం అయ్యారు

ప్రియప్రవక్త (సఅసం) ప్రజలకు సత్యధర్మ బోధన చేస్తున్నారు. అప్పట్లో హజరత్ ఉస్మాన్(రజి) వయస్సు 34 సంవత్సరాలు. మక్కాలో ఉన్న తాత ముత్తాతల సంప్రదాయాలకు, ప్రియప్రవక్త (సఅసం) బోధించే నూతన ధర్మానికి పొత్తు ఉండేదికాదు. ఈ నూతన ధర్మం సరికొత్త పద్ధతులు సూచించేది. అందువల్ల ఇదొక నూతన ధర్మంగ ప్రజలకు కనబడేది. కాని హజరత్ ఉస్మాన్(రజి) మంచి మనస్తత్వంకల వ్యక్తి. ఈ కొత్త ధర్మం, కొత్త పద్ధతులు ఆయనకు బాగుగ నచ్చాయి, మనశ్శాంతి కూడ చేకూర్చాయి.

హజరత్ అబూబకర్ (రజి), హజరత్ ఉస్మాన్ (రజి) గారి స్నేహితులు. హజరత్ అబూబకర్ (రజి) ఇస్లాం స్వీకరించారు. ముస్లిం అయ్యారు కూడ. ఇక హజరత్ అబూబకర్ (రజి) తన ధార్మిక బాధ్యతను గుర్తించి, దైవధర్మాన్ని

హజరత్ ఉస్మాన్(రజి) ఎదుట ప్రస్తావించారు. చాల సేపటి వరకు ఇరువురు మిత్రులు ఇస్లాంను గురించి చర్చించుకున్నారు. హజరత్ అబూబకర్ (రజి) ఇస్లాం ఔన్నత్యాన్ని తెలియజేశారు, జీవిత విజయానికి రాచబాట చూపించారు. హజరత్ ఉస్మాన్ (రజి) ఆ విషయాలను శ్రద్ధగా విన్నారు. అవగాహన చేసుకొన్నారు, ప్రియప్రవక్త (సఅసం) దగ్గరకు వెళ్ళి ఇస్లాం స్వీకరించడానికి సిద్ధమయ్యారు.

అనుకోకుండా హజరత్ ముహమ్మద్ (సఅసం) హజరత్ అబూబకర్ (రజి) గారి ఇంటికి వచ్చారు. హజరత్ ఉస్మాన్ (రజి)ను అక్కడ చూచి అన్నారు: "ఓ ఉస్మాన్! దైవం ప్రసాదించే స్వర్గాన్ని స్వీకరించు. మానవాళికంతటికి చక్కటి మార్గం చూపడానికి నేను పంపబడ్డాను."

ఈ వాక్యాలు వింటూనే హజరత్ ఉస్మాన్ (రజి) ఆసక్తిపరుడయ్యారు. ఒక్కమారు ప్రియప్రవక్త (సఅసం)గారి చేతిని పట్టుకొన్నారు, ఆయన (సఅసం) చేతిలో చేయి వేసి ఇస్లాం సద్వచనం పఠించారు. ఈ విధంగా ఆయన ముస్లింలలో చేరిపోయారు.

## సత్యధర్మంపై నిలకడగ నిలవడం

హజరత్ ఉస్మాన్ (రజి) ముస్లిం అయ్యారనే వార్త మక్కా పట్టణంలో మెరుపులా వ్యాపించింది. నలుదిశల ప్రజలు చెవులుకొరుక్కుంటున్నారు. ఎవరిని చూచినా ఏముంది? అందరూ అందరే. హజరత్ ఉస్మాన్ (రజి)ను దూషిస్తున్నారు. కుటుంబీకులందరు ఆయనకు విరోధులయ్యారు. ప్రారంభంలో నచ్చజెప్పారు, ప్రలోభ పెట్టారు. బెదిరించారు. చివరకు కొట్టడం ప్రారంభించారు. కాని ఆ ధృఢ విశ్వాసిపై ఎలాంటి ప్రభావం పడలేదు. ఆయన వారు చెప్పే మాటలను లెక్కించలేదు, కొట్టినా, తిట్టినా వారిని ఖాతరు చేయలేదు. సత్యధర్మంపై నిలకడగా నిలిచారు. కుటుంబీకుల ప్రయత్నం విఫలమయింది, వారి కాఠిన్యం మరింత హెచ్చింది. ఉస్మాన్ (రజి)ను చూస్తే చాలు భగ్గుమని మండిపోయేవారు.

చివరకు పినతండ్రి హకమ్ ఇబ్నె ఆస్‌కు చెడ్డ కోపం వచ్చింది. ఒక తాడుతో ఉస్మాన్ (రజి) కాళ్ళు చేతులు కట్టిపడేశాడు, కళ్లెర్రజేసి అన్నాడు: "నీవు మన తాతముత్తాతల ధర్మం వదిలావు, మమ్మల్ని కించపరిచావు, మా గౌరవం మంటకలిపావు. దైవసాక్షిగ చెబుతున్నా! నీవు ఈ క్రొత్త ధర్మాన్ని విడిచిపెట్టానని ప్రకటించనంతవరకు, కట్టిన తాడు విప్పను."

హజరత్ ఉస్మాన్ (రజి) దేనికి భయపడతారని! ఇలా చెప్పారు: "బాబాయీ! నేను అల్లాహ్ సాక్షిగ చెబుతున్నాను విను. నా బొందిలో ప్రాణమున్నంతవరకు నేను ఇస్లాం సత్యధర్మాన్ని వదిలే వాణ్ణికాను." హకం కోపాగ్ని మరింత ఎగప్రాకింది. హజరత్ ఉస్మాన్ (రజి) ముఖం మీద లాగి ఒక లెంపకాయ వేసి వెళ్ళిపోయాడు.

కొన్ని దినముల వరకు హజరత్ ఉస్మాన్(రజి) అలాగే కాళ్ళుచేతులు కట్టబడి ఓ గదిలో ఉన్నారు. చివరకు ఆయన కుటుంబీకులు చేసేదిలేక కట్లు విప్పి హజరత్ ఉస్మాన్ (రజి)ను వదిలారు.

## ఆయన (రజి) వివాహం

ప్రియప్రవక్త (సఅసం)కు హజరత్ రొఖియ (రజి) అనే కూతురున్నారు. ఈమె వివాహం మొదట తన పినతండ్రి అబూలహబ్ కుమారుడు ఉతుబతో జరిగింది. ప్రారంభంలో ఈ సంబంధంతో అబూలహబ్ సంతసించాడు. తన తనయుడు ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం) కుమార్తెను చేసుకున్నాడని గర్వపడేవాడు. కాని ప్రియప్రవక్త (సఅసం) సత్యధర్మ ప్రచారానికి పూనుకోగానే అబూలహబ్ ఆయన(సఅసం)కు పరమ శత్రువయ్యాడు, ఆయన (సఅసం)ను వేధించడం ప్రారంభించాడు. ఆ కోపంతో హజరత్ రొఖియ (రజి)కు విడాకులివ్వమని తన తనయుడ్ని పురిగొల్పాడు. తండ్రి మాటకాదనక తనయుడు రొఖియాకు విడాకులిచ్చేశాడు.

ఈ విడాకుల విషయం ప్రియప్రవక్త(సఅసం)కు దుఃఖం కల్గించింది. కొన్ని దినముల తరువాత బాగుగ ఆలోచించి హజరత్ రొఖియ (రజి)

వివాహం హజరత్ ఉస్మాన్(రజి)తో చేయదలిచారు. ఈ విషయం హజరత్ ఉస్మాన్ (రజి)కు తెలిసింది. ఆయన అపరిమితంగ ఆనందపడ్డారు. ప్రియప్రవక్త (సఅసం)తో సంబంధం కలిగి ఉండడం తన అదృష్టమని భావించారు. వెంటనే సిద్ధమయ్యారు. హజరత్ ఉస్మాన్ (రజి) హజరత్ రొఖియా (రజి)ను వివాహమాడి ప్రియప్రవక్త (సఅసం)కు అల్లుడయ్యారు. ఈ బాంధవ్యం వల్ల హజరత్ ఉస్మాన్(రజి) నిత్యం హర్షం ప్రకటించేవారు.

## హబష్ (అబిసీనియా)కు వలస వెళ్ళడం

మక్కాలో ఇస్లామీయ ఉద్యమం ముందుకు సాగుతోంది. సత్య సంధులు ఇస్లాం స్వీకరిస్తున్నారు. ఇది చూడలేని మక్కా అవిశ్వాసులు కళ్ళెర్ర జేశారు. తాతముత్తాతల ధర్మాన్ని వదలి ఇస్లాం స్వీకరించేవారిని వారు వివిధ రీతుల్లో హింసించేవారు. వారు పెట్టే బాధలు చూస్తే ఒళ్ళు జలదరించేది.

హజరత్ ఉస్మాన్ (రజి) ఉన్నత కుటుంబంతో సంబంధం కలవారు. అయినప్పటికీ ఆయన (రజి) ఈ దుండుగుల జులుంకు గురయ్యారు. బంధువులు ఆయనకు విరోధులయ్యారు. వంశం, కుటుంబం, బంధుత్వం లెక్కచేయకుండ ఆయన్ను శత్రువుగ పరిగణించారు ఇస్లాం విరోధులు.

హజరత్ ఉస్మాన్ (రజి) ఇస్లాం కోసం అవిశ్వాసుల వేధింపులను సహించేవారు, బాధలను భరించేవారు. అయితే అవిశ్వాసుల దౌర్జన్యాలు హద్దుమీరిపోవడం వల్ల దైవప్రవక్త (సఅసం) విశ్వాసులను అబిసీనియాకు వలస పోవడానికి అనుమతి ఇచ్చారు. ఈ అనుమతితో హజ్రత్ ఉస్మాన్ (రజి), సతీమణి హజరత్ రొఖియ (రజి)ను తీసికొని అబిసీనియా దేశానికి వలస వెళ్ళారు.

ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం) హజరత్ అబూబకర్ (రజి)తో ఒకప్పుడు ఇలా అన్నారు: "నా సమాజంలో హజరత్ ఉస్మాన్(రజి) తన ఆలుబిడ్డలతో హిజరత్ (వలస) చేసిన ప్రథమ వ్యక్తి."

# స్వదేశానికి తిరిగి రావడం

హజరత్ ఉస్మాన్ (రజి) అబిసీనియా దేశంలో కొన్ని సంవత్సరాలు గడిపారు. అక్కడి వాతావరణం, పరిసరాలు హజరత్ ఉస్మాన్(రజి)ను ఆకట్టుకొన్నాయి. ప్రశాంతంగ, తృప్తికరంగ, సుఖప్రదంగ జీవితం గడుస్తోంది. కాని ఒక్క ఆవేదన ఆ దంపతులిద్దరికి కలిగేది. అది ప్రియప్రవక్త (సఅసం) ఎడబాటు, ఆయన (సఅసం)ను స్మరించుకొంటే ఇద్దరు వ్యాకులత పడేవారు. కాని చేసేదిలేక ఓర్పుతో ఉండిపోయేవారు.

కొన్నాళ్ళకు ఖురైషులు ముస్లింలయ్యారని ఒక వదంతి వ్యాపించింది. వాస్తవం కంటే ఊహాగానాలు అతివేగంగా వ్యాపిస్తాయి, నమ్మకం కలిగిస్తాయి కూడ. ఈ వార్త వినగానే భార్యాభర్తలకు అమిత సంతోషం కలిగింది. ఇద్దరు సామానులు సర్దుకొని మక్కాకు బయలుదేరారు. వారి వెంట మరికొందరు ముస్లింలు కూడా ఉన్నారు.

అందరూ స్వదేశం తిరిగిరాగానే ఈ వార్త నిజం కాదని, వదంతి మాత్రమేనని తెలిసింది. అలా తిరిగొచ్చిన ముస్లింలలో కొందరు మళ్ళీ హబష్ (అబిసీనియా) వెళ్ళిపోయారు. హజరత్ ఉస్మాన్ (రజి) మాత్రం తన సతీమణితో మక్కాలోనే ఉండిపోయారు.

# మదీనాకు హిజ్రత్ (వలస)

మక్కా అవిశ్వాసులు ముస్లింల పట్ల హద్దుమీరి ప్రవర్తిస్తున్నారు.వారి హింసా దౌర్జన్యాలు రోజురోజుకు అధికమవుతున్నాయి. ముస్లింల ప్రాణాలకు రక్షణ లేకుండాపోయింది. వారిలో కొందరు బాధలు భరించలేక ఒక్కోసారి దైవప్రవక్త (సఅసం)తో మొరపెట్టుకునేవారు. ఆయన (సఅసం) సహచరులకు సహనం వహించాలని నచ్చజెప్పేవారు. దైవమార్గంలో కష్టపడేవారికి అల్లాహ్ ఇచ్చిన శుభవార్తలను తెలియజేసేవారు. హజరత్ ఉస్మాన్ (రజి) సహనం వహిస్తూ అల్లాహ్‌కు కృతజ్ఞతలు తెలుపుకొంటూ ఆపదలను భరించేవారు. చివరకు అల్లాహ్ ముస్లింలకు మదీన వలసపోవడానికి అనుమతి ఇచ్చాడు.

ప్రియప్రవక్త (సఅసం) ఈ అనుమతి గురించి అనుచరులకు తెలియపరిచారు. మదీన వెళ్ళదలుచుకున్నవారు ఒక్కొక్కరు, ఇద్దరు ముగ్గురు చొప్పున ఎవరికి తెలియకుండ రహస్యంగా మదీన వెళ్ళమని చెప్పారు. అప్పుడు హజరత్ ఉస్మాన్ (రజి) శ్రీమతి హజరత్ రొఖియా (రజి)ను తీసుకొని రహస్యంగా మదీనాకు వలస పోయారు.

మదీన చేరి అక్కడ హజరత్ అవుస్ బిన్ సాబిత్‌గారి ఇంటిలో అతిథులయ్యారు. ఆ తరువాత ప్రియప్రవక్త (సఅసం), హజరత్ ఉస్మాన్ (రజి), హజరత్ అవుస్ (రజి)ల మధ్య సోదరబంధం కలుగజేశారు. ఇలాంటి సౌభ్రాతృత్వాన్ని అహద్-యె-మువాఖాత్ అంటారు. వారిద్దరు సోదరుల్లా జీవితం గడిపేవారు.

# రూమ్మ బావి

ఆ కాలంలో మదీన మునవ్వరలో ఒకే మంచి నీళ్ళ బావి ఉంది. దీనిని రూమ్మ బావి అనేవారు. దాని యజమాని ఒక యూదుడు. మంచినీళ్ళు తోడుకోవడానికి వచ్చిన ముస్లిములను అతడు పరేషాన్ చేసేవాడు. తానడిగిన డబ్బు చెల్లించమని డిమాండు చేసేవాడు. వలస వచ్చిన ముస్లింలతో మదీన జనసంఖ్య పెరిగింది, నీటి ఎద్దడి ఎక్కువయింది.

ఒకరోజు ప్రియప్రవక్త ముహమ్మద్ (సఅసం) 'సహబ'ను సంబోధిస్తూ "ఎవరైతే ఈ బావిని కొని అల్లాహ్ మార్గంలో అంకితం చేస్తారో వారికి అల్లాహ్ స్వర్గం ప్రసాదిస్తాడు" అని చెప్పారు. హజరత్ ఉస్మాన్ (రజి) ఈ మాట వినగానే లేచి బావి యజమాని అయిన యూదుని ఇంటికి వెళ్ళారు. బావిని కొనడానికి బేరం చేశారు. ఎంతో ప్రయత్నం చేయగా ఒక షరతుపై బావి సగభాగం పన్నెండు వేల దిర్హములకు ఇవ్వడానికి సిద్ధమయ్యాడు ఆ యూదుడు. ఆ షరతు ప్రకారం ఒక రోజు హజరత్ ఉస్మాన్ (రజి) నీరు తీసుకోవాలి; రెండవ రోజు ఆ యూదుడు నీరు తీసుకోవాలి.

ముస్లింలు హజరత్ ఉస్మాన్ (రజి)గారి వంతు వచ్చినప్పుడు రెండు రోజులకు సరిపడ నీటిని తోడుకొని పెట్టుకొనేవారు. దాంతో యూదుని

నీటి వ్యాపారం పడిపోయింది; అతని రాబడి తగ్గింది. చివరకు తన సగభాగం బావిని కేవలం 8 వేల దిర్హములకు హజరత్ ఉస్మాన్ (రజి)కే అమ్ముకొన్నాడు. ఈ విధంగ పూర్తి బావిని ఇరువదివేల దిర్హములకు కొన్నారు హజరత్ ఉస్మాన్ (రజి). దీని వల్ల ముస్లింల మంచినీటి సమస్య తీరింది. ఈ విధంగ కొన్న బావిని హజరత్ ఉస్మాన్ (రజి) దేవుని ప్రసన్నత కోసం ముస్లింలకు అంకితం చేశారు.

## నబవీ మసీదు విస్తరణ

ప్రియప్రవక్త (సఅసం) మదీనా వలస వచ్చిన తరువాత అల్లాహ్ ఆరాధన కోసం ఒక మసీదు నిర్మించారు. దాని పేరు నబవీ మసీదు. మదీన పట్టణంలో ముస్లింల సంఖ్య రోజురోజుకు పెరిగిపోతుండటం వల్ల నబవీ మసీదులో స్థలం కొరత ఏర్పడింది. ముస్లింలకు నమాజు చేయడంలో ఇబ్బంది కలుగుతోంది.

నబవీ మసీదు ప్రక్కన ఖాళీగా పడివున్న ఒక స్థలం అమ్మకానికి వచ్చింది. అప్పుడు ప్రియప్రవక్త అనుచరుల్ని ఉద్దేశించి, "అమ్మకానికి పెట్టిన ఆ ఖాళీస్థలాన్ని కొని మసీదు కోసం అంకితం చేసి తన ఔదార్యాన్ని ఉన్నతపరచుకొనే వారెవరైనా ఉన్నారా?" అని అడిగారు. అదృష్టవశాత్తు హజరత్ ఉస్మాన్ (రజి) అక్కడే వున్నారు. ఇలాంటి పుణ్య సందర్భాల కోసం ఆయన వేచి ఉండేవారు. విక్రయంకానున్న స్థలం విషయమయి యజమానితో బేరం చేశారు. చివరికి ఇరవై లేక ఇరవై ఐదువేల దిర్హములకు ఆ భూమిని కొని మసీదు కోసం అంకితం చేశారు. ఈ విధంగ హజరత్ ఉస్మాన్ (రజి) అంకితం చేసిన భూమిలో నబవీ మసీదును విస్తారం చేయడం జరిగింది.

మదీన వెళ్ళిన తరువాత హజరత్ ఉస్మాన్ (రజి) దైవమార్గంలో సమర్పించిన రెండవ కానుక ఇది.

# బదర్ యుద్ధంలో పాల్గొనడం

మక్కా బహుదైవారాధకులు సాగిస్తున్న దౌర్జన్యకాండకు తట్టుకోలేక ముస్లింలు, ఆ తరువాత ప్రియప్రవక్త (సఅసం) రహస్యంగా మదీనాకు వలస వచ్చారు. వారు స్వస్థలాన్ని వదలి వెళ్ళడం ఆ మూర్ఖులకు తెలిసిందికాదు. ఈ విధంగ వెళ్ళిపోవడం వల్ల మక్కా బహుదైవారాధకులు మరింత రెచ్చిపోయారు. రెండు సంవత్సరాలలోగా వారు ఒక పెద్ద సైన్యాన్ని తయారు చేసి మదీనాపై దండెత్తడానికి వచ్చారు. ముస్లింలు కూడ వారికి తగిన జవాబివ్వడానికి సిద్ధమయ్యారు. ముస్లిం సైన్యం అవిశ్వాసుల సైన్యంతో పోలిస్తే మూడవ వంతు మాత్రమే వుంది. ఈ రెండు సైన్యాలు బదర్ మైదానంలో ఢీకొన్నాయి.

హజరత్ ఉస్మాన్(రజి) బదర్ యుద్ధంలో పాల్గొనడానికి సిద్ధమయితే ఒక క్లిష్ట సమస్య ఎదురయ్యింది. ఆయన సతీమణి హజరత్ రొఖియ (రజి) వ్యాధిగ్రస్తురాలయ్యారు. ఆమెకు సేవ చేయుడానికి, చికిత్స చేయించడానికి ఎవరూలేరు. అందువల్ల ప్రియప్రవక్త (సఅసం) హజరత్ ఉస్మాన్ (రజి)ను యుద్ధంలో పాల్గొనడం నుండి వారించారు. "నేను నిన్ను మదీనలోనే రొఖియ(రజి) చికిత్స కోసం వదలుచున్నాను, ఆమెను చూసుకోవడానికి ఎవరూ లేరు. యుద్ధంలో పాల్గొనలేకపోయినందుకు చింతించనవసరం లేదు. అల్లాహ్ దృష్టిలో నీవు యుద్ధంలో పాల్గొన్నవారిలోనే పరిగణించబడతావు. యుద్ధంలో పాల్గొనే పుణ్యం, యుద్ధ రాబడిలోని భాగం కూడా నీకు లభిస్తాయి" అని అన్నారు ప్రవక్త (సఅసం).

ప్రియప్రవక్త (సఅసం) నోట వెలువడిన ఈ మాటలు విని హజరత్ ఉస్మాన్(రజి) తృప్తి చెందారు. హజరత్ రొఖియ (రజి) చికిత్స విషయం చూసుకొనేందుకు మదీనలోనే ఉండిపోయారు.

# హజరత్ రొఖియ (రజి) మరణం

హజరత్ రొఖియ (రజి)గారి వ్యాధి ముదిరింది. చికిత్స చేసిన కొద్దీ వ్యాధి అధికమవుతూపోయింది. చివరికి ఆమెను ప్రియప్రవక్త (సఅసం)

పట్టణంలో లేని సమయంలో మృత్యువు కబళించింది. "ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్."

హజరత్ ఉస్మాన్ (రజి), హజరత్ ఉసామ బిన్ జైద్ (రజి)లు హజరత్ రొఖియ (రజి) అంత్యక్రియలలో నిమగ్నులయిపోయారు. అంతలో అల్లాహు అక్బర్ అనే నినాదాలు వినవచ్చాయి. బదర్ యుద్ధంలో ప్రియప్రవక్త (సఅసం) విజయోన్ముఖులై సేనలతో వాపసు వస్తున్నారు. కాని పట్టణంలో కాలుపెట్టగానే హజరత్ రొఖియ (రజి) మరణవార్త వినడంతో ప్రియప్రవక్త (సఅసం) బాధపడ్డారు. ఆయన హజరత్ ఉస్మాన్ (రజి)ను ఓదార్చారు.

ఇంతకు ముందు చెప్పినట్లు ప్రియప్రవక్త (సఅసం) హజరత్ ఉస్మాన్ (రజి)ను బదర్ ముజాహిద్‌గా పరిగణించారు, యుద్ధంలో స్వాధీనమైన మాల్-యె- గనీమత్ నుంచి అందరితో పాటు సమానంగ ఆయనకు కూడా ఒక భాగం పంచి పెట్టారు. "అందరితో సమానంగ ఆయనకు పుణ్యఫలం కూడ ఉంద"ని మరో శుభవార్త కూడా చెప్పారు ఆయన (సఅసం).

## జున్నూరైన్ బిరుదు

ప్రియసతీమణి హజరత్ రొఖియ (రజి) ఇహలోకం వీడిపోయిన తరువాత హజరత్ ఉస్మాన్ (రజి) ఎల్లప్పుడూ దిగులుతో ఉండేవారు. ఒక రోజు హజరత్ ఉమర్ (రజి) వచ్చి సానుభూతి తెలియజేస్తూ, "అయ్యిందేదో అయిపోయింది. ఇంత దిగులుతో ఉండడం వల్ల లాభమేమిటి?" అన్నారు. ఆ మాట విని హజరత్ ఉస్మాన్ (రజి) ఇలా అన్నారు: "నా దురదృష్టం పట్ల నేనెంత చింతించినా తక్కువే. ప్రియప్రవక్త (సఅసం) ఒకసారి 'పరలోక విచారణ రోజు నా బంధుత్వం తప్ప అందరి బంధుత్వాలు తెగిపోతాయి' అని చెప్పారు. ఏం చెయ్యను? ఇప్పుడు ప్రియప్రవక్త (సఅసం) కుటుంబంతో నా బంధుత్వం తెగిపోయింది."

ఈ మాటలు ప్రియప్రవక్త (సఅసం) చెవిలో పడ్డాయి. ఆయన (సఅసం) రెండవ కూతురు ఉమ్మె కుల్సుం (రజి)తో హజరత్ ఉస్మాన్

(రజి) వివాహం చేయించారు. ఈ విధంగ ప్రియప్రవక్త కుటుంబీకులతో హజరత్ ఉస్మాన్ (రజి) సంబంధం మళ్ళీ ఏర్పడింది. హజరత్ ఉస్మాన్(రజి)కు ఎంతో సంతోషం కల్గింది.

ప్రియప్రవక్త (సఅసం)వారి ఇద్దరు కుమార్తెలను ఆయన వివాహం చేసి కొన్నందున ఆయనకు ఆ దినం నుండి జున్నూరైన్ (రెండు ప్రకాశముల వారు) అనే బిరుదు పడిపోయింది.

## హుదైబియా సంధి

బదర్ యుద్ధం మినహా ప్రియప్రవక్త (సఅసం) పాల్గొనిన అన్ని యుద్ధాలలో హజరత్ ఉస్మాన్ (రజి) పాల్గొన్నారు. హిజ్రీ శకం 4వ యేట 'అఖ్రఖాఅ' అనే యుద్ధ సమయంలో హజరత్ ఉస్మాన్(రజి) ప్రియప్రవక్త (సఅసం) స్థానంలో ఇన్‌చార్జిగా ఉన్నారు. హిజ్రీ శకం 6వ యేట ప్రియప్రవక్త (సఅసం) మక్కా వెళ్ళి బయితుల్లాహ్‌ను సందర్శించి రావాలని కోరారు. ఆయన (సఅసం) వెంట 14 వందల ముస్లింలున్నారు. హుదైబియా అనే స్థలం చేరినప్పుడు మక్కా ముష్రికులు యుద్ధ సన్నహాలు చేస్తున్నారు. ప్రియప్రవక్త (సఅసం) ఆ యుద్ధం చేయదలచలేదు. ఈ ఆలోచనతో ప్రియప్రవక్త (సఅసం) హజరత్ ఉస్మాన్ (రజి)ను తన తరఫున దూతగ మక్కా ముష్రికుల వద్దకు పంపారు, ముస్లింలు ఏ ఉద్దేశంతో వచ్చారో వారికి తెలియపరచమన్నారు. మక్కావారు యుద్ధం కోసం సిద్ధంగా ఉన్నారు. హజరత్ ఉస్మాన్ (రజి) రాగానే ఆయనను బందీ చేశారు. ఎన్నో దినముల వరకు వెళ్ళిన దూత తిరిగిరానందువల్ల ముస్లిందరికి విస్మయం కలిగింది. తరువాత హజరత్ ఉస్మాన్ (రజి) షహీద్ చేయబడ్డారని ఒక వదంతి కూడ పుట్టింది. ప్రియప్రవక్త (సఅసం)కు ఈ విషయం దుఃఖం కలిగించింది. హత్యకు ప్రతీకారం తీర్చుకోవాలని ప్రియప్రవక్త (సఅసం) ఒక చెట్టు నీడన కూర్చుండి ముస్లింల చేత 'బయితు' (ప్రతిజ్ఞ) చేయించారు. హజరత్ ఉస్మాన్(రజి) తరఫున తన హస్తాన్ని మరో హస్తంపై పెట్టి ప్రతీకార చర్యకు

పూనుకొంటానని ప్రతిజ్ఞ చేశారు. ఇలా ప్రతిజ్ఞ చేయడం గర్వకారణం కూడ. అలాంటి భాగ్యం ఎవరికీ లభించింది కాదు. ఈ ప్రతిజ్ఞను బయిత్-యె-రిజ్వాన్ అని అంటారు.

ఇటు ముస్లింలలో సమరోత్సాహం జనించింది. మక్కా ముష్రికులు ముస్లింల యుద్ధ సన్నాహాల వార్త విని భయంతో వణికిపోయారు. హజరత్ ఉస్మాన్ (రజి) బందీ నుండి విడుదల చేయబడ్డారు. తరువాత మక్కా నాయకులు ప్రియప్రవక్త (సఅసం) దగ్గరకు వచ్చి సంధి చేసుకొన్నారు. ఈ సంధిని "హుదైబియా సంధి" అంటారు.

## ఆయన (రజి) ఉదార స్వభావం

హి్జ్రీ శకం 9వ సంవత్సరం రోమన్ సామ్రాజ్యాధినేత అరేబియాపై దండెత్తడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆ దాడిని అరికట్టడం ఎంతైనా అవసరముంది. కాని ఆ కాలంలో అరబ్బుల పరిస్థితి మెరుగ్గా లేదు. ముస్లింలు బీదవారు, చేతుల్లో చిల్లిగవ్వ కూడా లేదు. రోమను సామ్రాజ్యం బహుగొప్పది. అగ్రరాజ్యంగ పరిగణించబడేది. ప్రియప్రవక్త(సఅసం) ఆందోళన చెందసాగారు. కిం కర్తవ్యం అని ఆలోచిస్తున్నారు. ముస్లింలను యుద్ధ నిధుల కోసం సహాయం చెయ్యమని అడిగారు. విరాళాలు విస్తృతంగ ఇవ్వమని కోరారు. చాలా మంది ముందుకు వచ్చారు. పెద్ద ఎత్తున విరాళాలిచ్చారు. ఇలాంటి సందర్భాలలో ఉస్మాన్ (రజి) వెనుకుండగలరా! ఆ సమయంలో షామ్ దేశం వెళ్ళిన ఆయన వ్యాపార బృందం మంచి లాభాలు గడించి వాపసు వచ్చింది. ప్రియప్రవక్త (సఅసం) సమక్షంలో హాజరయ్యారు హజరత్ ఉస్మాన్ (రజి), ఆయన (సఅసం)తో, "సైన్యానికయ్యే మూడవ వంతు ఖర్చు నేనిస్తాను" అన్నారు (10వేల మందితో కూడింది ఆ సైన్యం).

దీనికి తోడు ఒక వెయ్యి ఒంటెలను, డెబ్బది గుర్రాలను, మరొక వెయ్యి దీనార్ల సంచిని ప్రియప్రవక్త (సఅసం)కు సమర్పించారు. ఆయన చూపిన ఔదార్యాన్ని, త్యాగనిరతిని చూచి ప్రియప్రవక్త (సఅసం)

సంతోషించారు. దీనార్ల సంచిని తన చేతుల్లో పెట్టుకొని తిప్పుతూ ప్రియప్రవక్త (సఅసం) ఇలా అన్నారు: "ఈ దినం నుండి ఉస్మాన్ (రజి) చేసే పనులలో ఆయనకు నష్టం కలగదు."

## సలహా మండలి సభ్యుడు

ప్రియప్రవక్త (సఅసం) పరలోకగతులయ్యారు. హజరత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి) ఖలీఫా అయ్యారు. హజరత్ ఉస్మాన్ (రజి) ఖలీఫాకు ప్రత్యేక సలహాదారుడయ్యారు. హజరత్ అబూబకర్ (రజి) ఆయన సలహా తీసికోనిదే ఏ పనీ చేసేవారుకారు. రెండు సంవత్సరాల మూడు నెలల తరువాత మొదటి ఖలీఫా కూడ ఈ లోకం వదలి వెళ్ళారు. ఆయన చేసిన వీలునామా ప్రకారం హజరత్ ఉమర్ ఫారూఖ్ (రజి) ఖలీఫా అయ్యారు. హజరత్ ఉస్మాన్ (రజి) తన దస్తూరితో వీలునామా ప్రతి తయారుచేశారు. హజరత్ అబూబకర్ (రజి) వీలునామా వ్రాయించే సమయంలో కాబోయే ఖలీఫా పేరు చెప్పక ముందే స్పృహకోల్పోయారు. హజరత్ ఉస్మాన్ (రజి) ఎంతో సమయస్ఫూర్తితో ఆ ఖాళీ స్థలంలో హజరత్ ఉమర్ (రజి) పేరును వ్రాశారు. హజరత్ అబూబకర్ (రజి)కు మళ్ళీ స్పృహ వచ్చాక హజరత్ ఉస్మాన్ (రజి)ను వీలునామా చదివి వినిపించమన్నారు. వీలునామాలో హజరత్ ఉమర్ (రజి) పేరును ఖలీఫాగ వ్రాయబడిన సంగతి వినగానే "అల్లాహు అక్బర్" అన్నారు హజరత్ అబూబకర్ (రజి) అప్రయత్నంగా. హజరత్ ఉస్మాన్(రజి) విజ్ఞతా వివేచనలను చూచి హజరత్ అబూబకర్ (రజి) ఆయన్ను కొనియాడారు కూడ.

హజరత్ ఉమర్ (రజి) కూడ హజరత్ ఉస్మాన్ (రజి)ను ఎంతో గౌరవించేవారు. ఆయనిచ్చిన సలహాకు విలువనిచ్చేవారు. హజరత్ ఉమర్ (రజి) ఖలీఫాగ తన కోసం ఒక సలహా మండలి ఏర్పాటు చేశారు. ఆ సలహా మండలిలో హజరత్ ఉస్మాన్ (రజి) ఒక సభ్యుడుగ ఉన్నారు. పరిపాలన వ్యవహారాలలో సలహాదారునిగ ఆయనకు గొప్ప స్థానముండేది.

# ఆయన ఖలీఫా అయ్యారు

హజరత్ ఉమర్ (రజి) ప్రపంచాన్ని వదలిపోతున్నప్పుడు ఆయన స్థానంలో మరో ఖలీఫాను నియమించి వెళ్ళండని ప్రజలు ఆయన్ను అభ్యర్థించారు. కాని హజరత్ ఉమర్ (రజి) ఇలా అన్నారు: "ఈ విషయంలో నేను బాగుగ ఆలోచించాను కాని ఒక నిర్ణయం తీసికోలేకపొయ్యాను. అయినప్పటికి ఈ ఆరు మంది ఖలీఫా కావడానికి అర్హులు. వారిలో ఎవరి పట్ల ఏకాభిప్రాయం కల్గుతుందో ఆయన్ను మూడు దినములలో ఖలీఫాగ నియమించుకోండి" అని అన్నారు.

వారి పేర్లు: హజరత్ అలి (రజి), హజరత్ ఉస్మాన్ (రజి), హజరత్ జుబేర్ (రజి), హజరత్ తల్హా (రజి), హజరత్ సాఅద్ బిన్ వఖ్ఖాస్ (రజి), హజరత్ అబ్దుర్ రహమాన్ బిన్ అవుఫ్ (రజి).

హజరత్ ఉమర్ (రజి) అంత్యక్రియలు అయ్యాక ఈ ఆరు మంది సమావేశమయ్యారు. వారందరు హజరత్ అబ్దుర్ రహమాన్ బిన్ అవుఫ్ (రజి)ను ఈ ఎన్నిక ప్రక్రియ నిర్వహించాలని కోరారు. ఈ బాధ్యత నిర్వహణలో హజరత్ అబ్దుర్ రహమాన్ బిన్ అవుఫ్ (రజి) చాలా ఓర్పుతో కృషి చేశారు. ఎంతో భారం మోసికొని తిరిగారు. అది హజ్ సమయం. హజ్ ముగించుకొని ప్రజలు మదీన వస్తున్నారు. మదీన ప్రజలే కాకుండ ఇతర ప్రాంతాల ప్రజలు కూడా అక్కడ ఆసంఖ్యాకంగా ఉన్నారు. హజరత్ అబ్దుర్రహ్మాన్ (రజి) ఒక్కొక్కరిని కలిసి ఖలీఫాను నియమించే విషయంలో అభిప్రాయాలను సేకరించారు.

ఇలా మూడు రోజులు గడిచాయి. 'సహబ'ను మసీదులో సమావేశ పరచి ఒక చిన్న ఉపన్యాసం ఇచ్చారు. తరువాత ఆయన అందరికంటె ముందు హజరత్ ఉస్మాన్ (రజి) చేతిపై బయితు చేశారు. ఆ తరువాత హజరత్ అలి (రజి) మరి ఇతరులందరు ఆయన్నే ఖలీఫాగ ఎన్నుకొన్నారు. హజరత్ ఉస్మాన్ (రజి) ముస్లింల ఖలీఫా అయ్యారు. ఈ సంఘటన 4 మొహర్రం, 24 హిజ్రీ సోమవారం జరిగింది.

# ఖలీఫాగ ఉపన్యాసమిచ్చారు

హజరత్ ఉస్మాన్ (రజి) ఖలీఫా అయిన తరువాత ప్రజలను సమావేశ పరచి ఇలా ఒక ఉపన్యాసం ఇచ్చారు. "ఓ ప్రజలారా! మీరుంటున్న ఈ ప్రపంచం, మీరు గడుపుతున్న ఈ జీవితం అంతమవుతుంది. పుణ్యకార్యాలు, మంచి పనులు ఎన్ని చేయగలరో వాటన్నిటిని చేసుకొంటూ మరణం వైపు మరలండి. మీరీ లోకపు పద్ధతులు, తీరుతెన్నులు చూశారు.. జ్ఞాపక ముంచుకోండి. మోసగించడం ఈ లోకపు అలవాటు. జాగ్రత్త! ఐహిక జీవితం మిమ్మల్ని మోసగించకూడదు సుమా! షైతాను మనల్ని భ్రమలకు లోనుచేసి మోసగించి అపమార్గం పట్టించగలడు. మనకంటే ముందు ప్రపంచం వీడినవారి నుండి గుణపాఠం నేర్చుకోండి. అల్లాహ్ మిమ్మల్ని అనుక్షణం గమనిస్తున్నాడని భావిస్తూ మంచి పనులు చేస్తూ ఉండండి. ప్రపంచమే సర్వస్వమని భావించి దశాబ్దాల తరబడి భోగభాగ్యాలు అనుభవించినవారు నేడు ఎక్కడున్నారు? వారిని ఈ లోకం పూచికపుల్లలా తీసి పారేయలేదా? (వారు వట్టి చేతులతో ఇక్కడ నుండి వెళ్ళలేదా!) అందువల్ల ఇహలోకం గురించి అల్లాహ్ మనకు తెలిపిన విధంగా మీరీ లోకాన్ని వదలి వెళ్ళడానికి సిద్ధంగా ఉండండి. పరలోక ప్రియులుగా మారండి."

ఎన్ని మంచి మాటలు ఆయన సూచించారు. ప్రజలు ఆయన మాటలను శ్రద్ధగా ఆలకించారు. ఒక్కో పదం వారి హృదయాలలో దిగుతూ పోయింది.

# మొదటి కేసు

హజరత్ ఉస్మాన్ (రజి) ఖలీఫా అయిన తరువాత మొట్టమొదట ఆయన ముందు హజరత్ ఉబైదుల్లాహ్ బిన్ ఉమర్ ఫారూఖ్‌కు సంబంధించిన వ్యవహారం వచ్చింది. దాని వివరాలు ఇలా ఉన్నాయి:

హజరత్ ఉమర్ ఫారూఖ్ (రజి) వీరమరణం పొందకముందు ఆయన్ని హత్యచేసిన అబూలూలూ, నవముస్లిం అయిన ఒక ఈరానీ సర్దారు హుర్

ముజాన్, ఒక బానిస క్రైస్తవుడు జఫీన ఒక చోట కూర్చొని సమాలోచనలు జరుపుకుంటున్నారు. ఆ సమయంలో హజరత్ అబ్దుర్రహమాన్ బిన్ అబీబకర్ (రజి) వాళ్ళ సమీపం నుంచి నడచి వెళ్తున్నారు. ఆయన్ను చూడగానే హంతకుడు అబూలూలూ గబాలున లేచి వెళ్ళిపోయాడు. లేచే సమయంలో అతని చేతిలోని కత్తి క్రింద పడిపోయింది. కత్తి పడడం, దాన్ని అబూలూలూ వంగి తీసికోవడం అంతా హజరత్ అబ్దుర్ రహ్మాన్ (రజి) గమనించారు. విషయం అంతటితో ముగియలేదు. అబూలూలూ హజరత్ ఉమర్ (రజి)ను కత్తితో గాయపరచడం, అతడు పట్టుబడి చంపబడటం జరిగినప్పుడు అతని వద్ద నుండి స్వాధీనం చేసుకోబడిన కత్తిని హజరత్ అబ్దుర్రహమాన్ (రజి) చూసి ఆ కత్తి ఇదేనని గుర్తుపట్టారు.

తరువాత ఆయన ఈ విషయాన్ని తన సోదరుడు హజరత్ ఉబైదుల్లాహ్ బిన్ ఉమర్ (రజి)కు చెప్పారు. ఉబైదుల్లా గొప్ప మల్లయోధుడు. ఈ సంగతి వినగానే ఆయనకు కోపం వచ్చింది. తీవ్రమైన ప్రతీకార వాంఛతో చివాలున లేచి వెళ్ళి హంతక ముఠాలోని హుర్‌ముజాన్‌ను హతమార్చారు. హజరత్ సాఅద్ బిన్ అబి వఖ్ఖాస్ ఈ దుర్ఘటన చూడగానే పరుగెత్తుకు వెళ్ళి అబ్దుల్లాహ్ బిన్ ఉమర్ (రజి)ని నిర్బంధంలోకి తీసుకున్నారు.

ఈ కేసు హజరత్ ఉస్మాన్ (రజి) ఎదుటకు వచ్చింది. హుర్‌ముజాన్ హత్య విషయం అడుగగా ముద్దాయి నేరాన్ని ఒప్పుకొన్నాడు. అప్పుడు హజరత్ ఉస్మాన్ (రజి) సహచరుల సలహా కోరగా హజరత్ అలి (రజి) తన అభిప్రాయాన్ని తెలియజేస్తూ, హత్యానేరానికి ప్రతీకార శిక్షగా హంతకుడికి మరణశిక్ష విధించాలని అన్నారు. హజరత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) ఈ అభిప్రాయంతో విభేదిస్తూ, "నిన్ననే తండ్రి హత్య చేయబడ్డారు. ఈ రోజు అతని కుమారుడ్ని చంపడమా! దీనివల్ల ప్రజలలో ఆందోళన బయలు దేరుతుంది" అని అన్నారు. ఈ అభిప్రాయాన్ని అందరూ బలపరచారు.

హజరత్ ఉస్మాన్ (రజి) కొద్దిసేపు ఆలోచించి ఇలా అన్నారు: "ఈ సంఘటన నేను ఖలీఫా కాకముందు జరిగింది. అందువల్ల దాని బాధ్యత

నాపై లేదు." ఆ తరువాత ఆయన హజరత్ ఉబైదుల్లా బిన్ ఉమర్ (రజి)కు సంరక్షకుడయి అతని తరపున హతుని బంధువులకు రక్తపరిహారం చెల్లించారు. ఈ తీర్పు అందరికి నచ్చింది. హజరత్ ఉబైదుల్లా బిన్ ఉమర్ (రజి) ప్రాణం దక్కింది.

## ఈరానీయన్ల తిరుగుబాటు

హజరత్ ఉమర్ (రజి) మరణం ముస్లింలలో తిరుగుబాటు ప్రకంపనల్ని లేపింది. ఈరాన్ రాజు యజ్దగిర్ద్ ఇంకా సజీవంగ ఉన్నాడు. అతడు ఈరాన్ నుండి బహిష్కరించబడ్డాడు. ఇది మంచి సమయమని ఇస్లామీయ ప్రభుత్వానికి వ్యతిరేకంగ కుట్రలు చేయడం ప్రారంభించాడు. ఈరానీయన్లు ఆయనకు తోడుగ నిలిచారు. అయితే హజరత్ ఉస్మాన్ (రజి) తిరుగుబాటు దారుల దుశ్చర్యల పట్ల ఏమాత్రం అజాగ్రత్తగా లేరు. తక్షణమే ఆయన ఈరానీయన్లకు తగిన శాస్తి చేయడానికి ఒక సైనిక దళాన్ని పంపించారు.

ముస్లిం సేనలు ఈరానీయన్లను అనేక చోట్ల ఎదుర్కొన్నాయి. ప్రతి చోటా ఈరానీయన్లకు పరాజయమే ఎదురయింది. దాంతో వారు పలాయనం చిత్తగించారు. ఈరానియన్ల ఎత్తుగడల్ని శాశ్వతంగ వమ్ము చేయడానికి ముస్లిం సైన్యాలు ఈరాన్‌లో చొరబడి తీవ్రంగా విజృంభించాయి. అనేక ప్రాంతాలను వశపరచుకొన్నాయి. చివరికి ఈరానియన్లు తమ ఓటమిని అంగీకరించి ముస్లింలతో తిరిగి శాంతి ఒప్పందం చేసుకున్నారు. రెండవసారి సాధించిన విజయంతో ఇస్లామీయ సామ్రాజ్యం మరింత విస్తరించింది. ఒకవైపు బలగ్, టర్కీలలో ఇస్లాం జండ ఎగురుతూవుంది. రెండవ వైపు హిరాత్, కాబుల్, గజనీ దేశాల పాలకులు ఖలీఫాకు విధేయులయిపోయారు. ఖురాసాన్‌లోని నేషాపూర్, తోస్, మరూ వగైరా ప్రాంతాలు క్రమక్రమంగా ఇస్లామీయ సామ్రాజ్యంలో చేరిపోయాయి.

కొన్ని దినముల తరువాత యజ్దగిర్ద్ కూడ మరణించాడు.

# రోమన్‌ల తిరుగుబాటు

రోము పాలకుడు ఖైసర్ కూడ దాడులు ప్రారంభించాడు. ఆసియా మైనర్ వైపు నుండి సిరియాపై దండెత్తాడు. హజ్రత్ ఉస్మాన్ (రజి) ఈ వార్త వినగానే హజరత్ మావియా(రజి) సహాయార్థం ఒక సైనిక దళం పంపించారు. హజ్రత్ మావియా (రజి) సిరియా చేరుకొని రోమన్ సేనలను మట్టి కరిపించారు. ఈ విధంగా ఇస్లామీయ సైన్యం ఆసియా మైనర్‌లో ప్రవేశించి విజయ పతాకం ఎగరవేస్తూ ఆర్మేనియా నుండి తబర్‌స్థాన్ వరకు చేరుకుంది. ఆఫ్రికాలో కూడ రోము పాలకుడు ఖైసర్ కుతంత్రాలు పన్నడం ప్రారంభించాడు. అక్కడి పాలకుడు జర్‌జీర్ ఎంతో పరాక్రమశాలి. అక్కడ రోమన్లను తీవ్రంగా ప్రతిఘటించవలసి వచ్చింది. యుద్ధం నలభై రోజుల పాటు సాగింది. చివరకు జర్‌జీర్ ఒక ప్రకటన చేస్తూ ముస్లిం సేనాధిపతి అబ్దుల్లా బిన్ సాఅద్(రజి)ను చంపి ఆయన తలను తెచ్చినవారికి లక్ష వరహాలు ఇవ్వడమే కాకుండ తన కూతురునిచ్చి వివాహం చేస్తానని అన్నాడు. ఈ ప్రకటన రోమ్ సైనికుల్లో నూతన ఉత్సాహాన్ని రేపింది.

హజరత్ అబ్దుల్లా బిన్ జుబైర్ (రజి) ఒక సలహా ఇస్తూ మనం కూడ ఇలాంటి ప్రకటన చేయాలని అన్నారు. అలాంటి ప్రకటన చేయడమయింది. యుద్ధం తీవ్రమయింది. చివరకు హజరత్ అబ్దుల్లా బిన్ జుబైర్(రజి) ముందుకు దూసుకొంటూ వెళ్ళి జర్‌జీర్‌ను వధించారు. అతని చావు వల్ల రోమన్ సైనికుల నడుము విరిగింది. దాంతో వారు కాలికి బుద్ధి చెప్పారు. ముస్లింలకు విజయం చేకూరింది. ప్రకటన ప్రకారం హజరత్ అబ్దుల్లా(రజి)కు లక్ష వరహాలు ఇవ్వడంతో పాటు జర్‌జీర్ కూతురితో వివాహం చేయబడింది. ఈ విధంగ తరాబ్లిస్ భూభాగంపై కూడ ముస్లిం రాజ్యం స్థాపించబడింది.

# కొన్ని ముఖ్య సంఘటనలు

హజరత్ ఉస్మాన్ (రజి) ఖిలాఫత్ కాలంలో కొన్ని ముఖ్య సంఘట నలు జరిగాయి. వాస్తవంగ చూస్తే ఈ సంఘటనలతో హజరత్ ఉస్మాన్

(రజి)కు ఎలాంటి సంబంధం లేదు. ఈ సంఘటనలే ఆ తరువాత దేశంలో కల్లోలాలు, సంక్షోభాలకు దారితీశాయి.

## మొదటి సంఘటన - కూఫా పరిపాలన

హజరత్ ఉమర్ (రజి) వ్రాసిన వీలునామ ప్రకారం హజరత్ ఉస్మాన్ (రజి), హజరత్ సాఅద్ బిన్ అబీ వఖ్ఖాస్ (రజి)ను కూఫా ప్రాంతానికి గవర్నర్‌గా నియమించారు. ఆ సమయంలో ప్రభుత్వ ధనాగారం, ఆర్థిక వ్యవహారాల బాధ్యతలు హజరత్ అబ్దుల్లాహ్ బిన్ మసూద్ (రజి)పై ఉన్నాయి. ఒకసారి హజరత్ సాఅద్ (రజి)కు తన అవసరాల నిమిత్తం సర్కారు ఖజాన నుండి ఒక పెద్ద మొత్తం అప్పుగా తీసుకోవలసి వచ్చింది. కొద్ది కాలం తరువాత హజరత్ అబ్దుల్లా (రజి) రుణం వాపసు చేయమని గవర్నర్‌ను అడిగారు. ఆ మాటపై గవర్నరు, కోశాధికారి మధ్య వివాదం వచ్చింది. ఈ వివాదంలో కూఫాలోని కొంత మంది హజరత్ సాఅద్(రజి) వైపు నిలబడ్డారు. మరికొందరు హజరత్ అబ్దుల్లా (రజి) వైపు నిల్చున్నారు.

ఈ విషయం హజరత్ ఉస్మాన్ (రజి) దృష్టికి వచ్చింది. చట్ట విరుద్ధమైన ఈ పని తన దృష్టికి రావడంతో ఆయన ఆగ్రహం వెలిబుచ్చారు. వెంటనే ఆయన హజ్రత్ సాఅద్ (రజి)ని గవర్నరు పదవి నుండి తొలగించి ఆయన స్థానంలో హజరత్ వలీద్ బిన్ అఖ్బాను నియమించారు. వలీద్, బనీఉమయ్యా వంశానికి చెందిన వ్యక్తి. ఈ సంఘటన హిజ్రీ శకం 25వ యేట జరిగింది.

## రెండవ సంఘటన - ఈజిప్టు పరిపాలన

హజరత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) ఈజిప్టు ప్రాంతానికి గవర్నరుగ ఉన్నారు. ఈయన ఈ పదవిని హజరత్ ఉమర్ (రజి) ఖలీఫాగ ఉన్నప్పటి నుండి అలంకరించి ఉన్నారు. ఈజిప్టు ప్రజలకు నీటిపారుదల సౌకర్యాలు కల్పించబడినందున ఆయన కేంద్రానికి శిస్తు తక్కువగా పంపించేవారు. దీనిపట్ల హజరత్ ఉమర్ (రజి)కు అభ్యంతరముండేది. హజరత్ ఉస్మాన్(రజి)

ఖలీఫా అయిన తరువాత శిస్తు పెంచమని అడిగితే- "ఒంటె అంతకంటె ఎక్కువ పాలివ్వజాలద"ని అన్నారు హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి). అప్పుడు హజరత్ ఉస్మాన్ (రజి), గవర్నరు అధికారాలను తగ్గించి ఆర్థిక, వ్యావసాయిక శాఖలకు సంబంధించిన అధికారాలు అబ్దుల్లా బిన్ అబీసరాకు ఇచ్చివేశారు. దీనివల్ల శిస్తు రాబడి రెట్టింపు అయింది.

అప్పుడు హజరత్ ఉస్మాన్ (రజి), "చివరకు ఆ ఒంటే పాలెక్కువ ఇచ్చింది కదా!" అన్నారు అమ్ర్ బిన్ ఆస్ (రజి)తో. దానికి ఆయన సమాధానమిస్తూ, "నిజమే. ఒంటె ఎక్కువగానే పాలిస్తోంది. కాని దాని పిల్లలు ఆకలిదప్పులతో ఉండిపోయాయి" అన్నారు.

ఇలా హజరత్ ఉస్మాన్ (రజి) చేసిన మార్పులతో రాష్ట్రపాలన సాగింది. కాని గవర్నరుకు, కోశాధికారికి మధ్య పరస్పరం ఆరోపణలు వచ్చాయి. ఈ వివాదం క్రమంగా ముదిరిపోయి, వ్యవహారం హజరత్ ఉస్మాన్ (రజి) ముందుకు వచ్చింది. ఆయన దర్యాప్తు చేయిస్తే, తప్పు హజరత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి)దే అని తెలిసింది. వెంటనే ఆయన హజ్రత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి)ని గవర్నరు పదవి నుండి తొలగించి మొత్తం అధికారాలను అబ్దుల్లా బిన్ అబీసరాకు సంక్రమింపజేశారు. ఈయన హజరత్ ఉస్మాన్ (రజి)గారి క్షీర సంబంధిత సోదరుడు. ఈ సంఘటన హిజ్రీ శకం 26వ యేట జరిగింది.

## మూడవ సంఘటన - బస్రా పరిపాలన

బస్రా గవర్నరు హజరత్ అబూ మూసా అష్అరీ (రజి) పట్ల అక్కడి ప్రజలు చాలా అసంతృప్తిగా ఉన్నారు. వారు ఆయనపై హజరత్ ఉమర్ (రజి)గారికి ఫిర్యాదు కూడా చేశారు. కాని హజరత్ ఉమర్ (రజి) ఠీవి, గాంభీర్యతల కారణంగా వ్యవహారం ముందుకు సాగేదికాదు. అయితే హజరత్ ఉస్మాన్ (రజి) ఖలీఫా కాగానే బస్రా ప్రజలు ఆయన మెతక వైఖరిని ఆసరాగా చేసుకొని హజరత్ అబూ మూసా అష్అరీ (రజి)ని బహిరంగంగానే వ్యతిరేకించడం ప్రారంభించారు.

యాదృచ్ఛికంగా ఆ రోజుల్లోనే కుర్దు తెగవాళ్ళు తిరుగుబాటుకు పాల్పడ్డారు. హజరత్ అబూ మూసా (రజి) మసీదులో 'జిహాద్' మీద ప్రసంగించారు. యుద్ధానికి కాలినడకన వెళ్ళేవారికి అత్యధిక పుణ్యం లభిస్తుందని చెప్పారు. ఉపన్యాసం ప్రజలను ప్రభావితం చేసింది. వాహన సౌకర్యం ఉన్నవారు కూడ కాలినడకనే యుద్ధరంగానికి వెళ్ళడానికి సిద్ధమయ్యారు. కాని సైన్యం బయలుదేరే సమయం వచ్చినప్పుడు హజరత్ అబూ మూసా అష్అరీ (రజి) టర్కీకి చెందిన మేలు జాతి గుర్రం మీద ఎక్కి కూర్చున్నారు. ఆయన సామాను నలభై కంచెర గాడిదలపై కట్టబడి ఉంది. ఇది చూసి కొంతమంది ముందుకొచ్చి గుర్రపు కళ్ళెం పట్టుకొన్నారు. "మాటలకు చేతలకు మధ్య ఈ వ్యత్యాసం ఏమిటీ? ఇతరులకు చేసే హితబోధను స్వయంగ మీరెందుకు ఆచరించరు?" అంటూ వారాయన్ని నిలదీశారు. దానికి హజరత్ అబూ మూసా (రజి) తృప్తికరమైన సమాధానం ఇచ్చుకోలేకపోయారు.

వెంటనే కొందరు వ్యక్తులు మదీన వెళ్ళి గవర్నర్‌ను తొలగించ వలసిందిగా ఖలీఫా హజరత్ ఉస్మాన్ (రజి)ని డిమాండు చేశారు. ఆయన వారికి చాలా నచ్చచెప్పారు. కాని వారందుకు ససేమిరా అంగీకరించలేదు. హజ్రత్ ఉస్మాన్ (రజి) మార్గాంతరంలేక హజరత్ అబూ మూసా(రజి)ను తొలగించి ఆయన స్థానంలో అబ్దుల్లా బిన్ ఆమిర్‌ను గవర్నరుగ నియ మించారు. ఈయన కూడ బనూ ఉమయ్యా వంశానికి చెందిన మనిషే. ఈ సంఘటన హిజ్రీ శకం 29వ యేట జరిగింది.

## సముద్ర పోరాటాలు

సైప్రస్ ఎంతో సారవంతమైన ద్వీపము. ఇది రోమ్ సముద్రంలో సిరియా దేశానికి సమీపంలో ఉంది. రోమ్, యూరప్ దేశాల నుండి శత్రువులు ఈ ద్వీపం గుండా ఈజిప్టు, సిరియాలపై సునాయాసంగ దండెత్తే ప్రమాదం ఉంది. సైప్రస్, రోమ్ పాలకుడైన ఖైసరు అధీనంలో ఉంది. ఈ మార్గం

ముస్లింలకు ఎల్లప్పుడూ చికాకు పరుస్తూ ఉండేది. అమీర్ మావియ (రజి) హజరత్ ఉమర్ (రజి)ను సముద్ర పోరాటం కోసం అనుమతి ఇవ్వమని అడిగితే అప్పట్లో అనుమతి లభించలేదు.

ఆ తరువాత హజరత్ ఉస్మాన్ (రజి) పాలనాకాలంలో కూడా ఈ యుద్ధం చేయడానికి అనుమతించమని మళ్ళీ కోరడమయినది. హజరత్ ఉస్మాన్ (రజి) ఒక షరతుపై ఈ యుద్ధం చేయడానికి అనుమతించారు. ఎవరినీ యుద్ధానికై బలవంతం చేయరాదని, సంతోషంగ యుద్ధంలో పాల్గొనడానికి వచ్చేవారినే తీసికెళ్ళాలని ఆయన షరతు విధించారు.

సముద్రయానం చేసే ముస్లింల నౌక ఎంతో హుందాగా బయలు దేరింది. ఆ కాలంలో రోమ్ పాలకుడు ఖైసరు దగ్గర మాత్రమే సముద్ర సైన్యం ఉండేది. రోమన్లతో దాదాపు యాభై యుద్ధాలు జరిగాయి. ప్రతి యుద్ధంలోనూ వారు చిత్తుగా ఓడిపోయారు. ఈ యుద్ధంలో కూడ విజయం ముస్లింలనే వరించింది. సైప్రస్‌తో సహా రోమ్ అధీనంలో ఉన్న ద్వీపాలన్నిటినీ ముస్లింలు వశపరచుకొన్నారు. దాంతో ఖైసరు ధైర్యం సన్నగిల్లింది.

ఈ యుద్ధాలు హిజ్రీ శకం 31వ సంవత్సరం వరకు విడతలవారీగా జరిగాయి.

## ఇతర విజయాలు

హజరత్ ఉస్మాన్ (రజి) పాలనాకాలంలో ఇస్లామీయ సామ్రాజ్యం సుదూర ప్రాంతాల వరకు విస్తరించింది. సైప్రస్, తరాబ్లిస్, తబ్రిస్తాన్‌లతోబాటు ఇంకా ఎన్నో విజయాలు ముస్లింలకు చేకూరాయి. హిజ్రీ శకం 31వ సంవత్సరం హబీబ్ బిన్ ముసల్లిమ ఫహ్రీ ఆర్మేనియాను జయించి ఇస్లామీయ సామ్రాజ్యంలో చేర్చారు.

హిజ్రీ శకం 32లో అమీర్ మావియ (రజి) కాన్‌స్టాంటినోపిల్ వరకు పురోగమించారు. అదే సంవత్సరం అబ్దుల్లా బిన్ ఆమిర్ (రజి) మరూరూద్, తాలిఖాన్, ఫార్యాన్, జూజ్‌జాన్ ప్రాంతాలలో విజయ పతాకాలు ఎగరవేశారు.

హి|జీ శకం 33లో అమీర్ మావియ (రజి) రోమ్‌కు చెందిన హసనుల్ మరాత్‌పై దండెత్తారు. ఆ సంవత్సరమే ఖురాసాన్‌లో చెలరేగిన తిరుగు బాటును అణచివేసి తిరుగుబాటుదారులను లొంగదీసుకోవడం జరిగింది.

హజరత్ ఉస్మాన్ (రజి) పాలనా కాలంలోనే రోమ్ చక్రవర్తి ఖైసర్ చంపబడ్డాడు. ఈరాన్ చక్రవర్తి యజ్దగర్ద్ కూడ చనిపోయాడు. వీరిద్దరు ఇస్లామీయ సామ్రాజ్యంలో మాటిమాటికి సంక్షోభం సృష్టిస్తూ దాన్ని అతలా కుతలం చేస్తుండేవారు. ఇప్పుడా పరిస్థితి తొలగిపోయింది. ప్రజలు ప్రశాంతంగా జీవితం గడపసాగారు.

## భోగ లాలసతో పతనారంభం

హజరత్ ఉస్మాన్ (రజి) గారి పన్నెండు సంవత్సరాల పరిపాలనలో మొదటి ఆరేళ్ళు ప్రశాంతంగా గడచిపోయాయి. ఎన్నో విజయాలు లభిం చాయి. ఇస్లామీయ సామ్రాజ్యం చాలా దూరం వరకు విస్తరించింది. పెద్ద ఎత్తున సిరిసంపదలు లభించాయి. సిరిసంపదలు పెరగడం వల్ల ఇతర జాతులలో ఏ రుగ్మతలు జనిస్తాయో ఆ రుగ్మతలన్నీ ముస్లిం సమాజంలో కూడ చోటుచేసుకోవడం మొదలయింది. చెమటోడ్చి కష్టపడడానికి బదులు వారిలో సుఖప్రియత్వం, సోమరితనాలు వచ్చిపడ్డాయి. ప్రతి మనిషీ సమాజ శ్రేయస్సు, దేశ ప్రయోజనాలను నిర్లక్ష్యం చేస్తూ స్వలాభపరుడయిపోయాడు. దాని పర్యవసానంగ ప్రజలలో పరస్పరం ద్వేషం, విరోధ భావాలు జనించాయి. ఐకమత్యం అడుగంటిపోయింది.

అందువల్లనే మహాప్రవక్త ముహమ్మద్ (సఅసం) ఇలా ప్రవచించారు: "మీ పేదరికం వల్ల నేను భయపడటం లేదు. (భవిష్యత్తులో) మీ ప్రాపంచిక సిరిసంపదలు తెచ్చే ప్రమాదాల వల్లనే నాకు భయమేస్తుంది."

## ఉపద్రవాలు

హ|జత్ ఉస్మాన్ (రజి) గారి పాలనాకాలం చివరి దశ ఎంతో బాధా మయమైన కఠిన పరీక్షా కాలం. దాని అంతర్గత కారణాలు ఇలా ఉన్నాయి:

1. ప్రియప్రవక్త (సఅసం) పర్యవేక్షణలో సుశిక్షితులైన 'సహబ' కాలక్రమేణ అంతమయ్యారు. బ్రతికి ఉన్నవారు వృద్ధాప్యం వల్ల మూలబడ్డారు. యువకుల్లో దీక్షాదక్షతలు కొరవడ్డాయి. నీతి, న్యాయం, నిజాయితీలలో వారు తమ పూర్వీకులతో సరితూగలేకపోయారు.

2. సామ్రాజ్యం ఎంతో విశాలంగా విస్తరించింది. నానాజాతులు ఆ రాజ్యంలో నివసిస్తున్నాయి. ఆ జాతులవారికి ముస్లింల పట్ల ద్వేషం, విరోధ భావాలు ఉన్నాయి.

3. హజరత్ ఉస్మాన్ (రజి) ఎంతో సద్గుణసంపన్నులు, దయార్ద్ర హృదయులు, మృదుస్వభావి. ఆయన ఎవరి పట్ల కూడా కఠినంగ ప్రవర్తించే వారుకాదు. ఇలాంటి దయార్ద్రత, మృదు స్వభావాల కారణంగా దుష్టస్వభావం కలవారికి ఎక్కడలేని ధైర్యం పుట్టుకొచ్చింది.

4. ఆయన తన వంశస్థులను ఎంతో అభిమానించేవారు. తరచుగా వారికి తన సొంత డబ్బిచ్చి సహాయపడుతుండేవారు. గిట్టని వారు ఈ డబ్బంతా సర్కారు ఖజానాలోనిదని ప్రచారం చేశారు.

5. నవతరంలో ఇమాం పట్ల పూర్వీకుల్లో ఉండేటటువంటి విధేయతా భావం కొరవడింది.

6. కొత్తగా ఇస్లాం స్వీకరించి ముస్లింలయిన ఇతరజాతుల వారికి సరైన శిక్షణ లభించలేదు. తర్వాత కాలంలో వీరే అరాచకం, అల్లకల్లోలాలకు కారణమయ్యారు.

## బాహ్య కారణాలు

అంతర్గత కారణాలు అరాచకం, సంక్షోభాలకు ఎలా దారితీశాయో, బాహ్య కారణాల వల్ల కూడ ఈ వైపరీత్యాలు జనించాయి. హజరత్ ఉస్మాన్ (రజి) వాటన్నిటిని ఎదుర్కోవలసి వచ్చింది.

# తెగల శత్రుత్వం

1. బనూ ఉమయ్య తెగవారు సాధించిన ఈ ప్రగతి బనూహాషిం తెగవారికి కంటకప్రాయంగా మారింది. వారు ఖిలాఫత్ పదవికి, ఇతర పదవులకు తామే హక్కుదారులమని తలచేవారు.
2. అదే విధంగ అరబ్బులలోని ఇతర తెగలవారు కూడ ఆ పదవులకు తాము హక్కుదారులమని, ఖురైషీయులకు ఏమాత్రం తీసిపోమని భావించేవారు. అందువల్ల వారు ఖురైష్ అధికారుల గర్వాన్ని అణచి వేయాలని అనుకుంటున్నారు.
3. మజూసీలు (అగ్ని పూజారులు) తమకు మరిన్ని హక్కులు, రాయితీలు ఇచ్చే వంశానికి ఖిలాఫత్ పదవి సంక్రమింపజేయాలని చూస్తున్నారు.
4. యూదులు ఏ విధంగానైనా ముస్లిం సమాజంలో చీలికలు తెచ్చి, వారి సామ్రాజ్యాన్ని, శక్తిని ముక్కలు ముక్కలుగా చేయాలని కాచుకొని కూర్చున్నారు.

ఈ దురుద్దేశాలను నెరవేర్చుకోవడానికి వారంతా మొత్తం సామ్రాజ్యంలో రకరకాల కుట్రలు పన్నుతూ అరాచకం, అల్లకల్లోలాలు సృష్టించసాగారు.

# అతి పెద్ద కల్లోలం

హజరత్ ఉస్మాన్ (రజి) పరిపాలనా కాలంలో చెలరేగిన అరాచకానికి మూలకారణం అబ్దుల్లా బిన్ సబా. అతను యమన్ ప్రాంతానికి చెందిన యూదుడు. అతని తల్లి అబిసీనియా దేశానికి చెందింది. అందువల్ల ఇతణ్ణి ఇబ్నెఅస్వద్ (నల్లదాని కొడుకు) అని కూడ అంటారు. ఉస్మాన్ (రజి) ఖిలాఫత్ 8వ సంవత్సరం అతను బస్రా గవర్నరు అబ్దుల్లా బిన్ ఆమిర్ (రజి) వద్దకు వెళ్ళి ఇస్లాం స్వీకరించాడు. కాని అతని ఇస్లాం సీకారం ఒక సాకు మాత్రమే. అసలతను ముస్లింగా ఉంటూ ఇస్లామీయ పరిపాలనను అంతమొందించ దలచాడు.

ప్రారంభంలో అతడు హజరత్ ఉస్మాన్ (రజి)గారి గవర్నర్లను నిందలపాలు చేయడం ప్రారంభించాడు. మొట్టమొదట అతణ్ణి బస్రా నుండి తొలగించడం జరిగింది. అక్కడ్నుంచి అతను కూఫా చేరుకున్నాడు. కూఫా నుండి సిరియా మీదుగా ఈజిప్టు చేరుకొన్నాడు. ఈజిప్టును తన కార్యకలాపాల కోసం కేంద్రంగ చేసుకున్నాడు. అతను వెళ్ళిన ప్రతి చోటా జిత్తులమారి ఎత్తుగడలతో అనేక మందిని అనుచరులుగా చేసుకునేవాడు. ఆ అనుచరులు పథకం ప్రకారం అరాచకం సృష్టించేవారు.

ఈజిప్టులో ఈ కపట విశ్వాసి హజరత్ ఉస్మాన్ (రజి)గారి అధికారులను బహిరంగంగా వ్యతిరేకించడం ప్రారంభించాడు. పైగా దానికి మతం రంగు పులిమేవాడు. ప్రియప్రవక్త (సఅసం)కు అసలు వారసుడు హజరత్ అలి (రజి) మాత్రమేనని, ఇతరులు బలవంతంగ వారసులయ్యారని ప్రచారం చేయడం మొదలెట్టాడు. అతను, అతని ఏజెంట్లు ఈ అపోహను బస్రా, కూఫా, ఈజిప్టులలో విస్తృతంగా వ్యాపింపజేశారు. అమాయక ప్రజలు అతని మోసపు వలలో పడిపోయారు.

## అతి పెద్ద అరాచకం

హజరత్ అబూబకర్ సిద్దీఖ్ (రజి) తన పరిపాలనా కాలంలో దివ్య ఖుర్‌ఆన్‌ని ఒక పుస్తకరూపంలో పొందుపరచారు. కాని దానిని ప్రచురించే, ప్రజలలో వ్యాపింపజేసే పని చేపట్టలేకపోయారు. హజరత్ ఉమర్ (రజి) కాలంలో ఈ పని నెరవేరింది. కాని అప్పటికీ ఖుర్‌ఆన్ పఠన రీతి వివిధ ప్రాంతాలలో వేరువేరుగా ఉండేది. దీనివల్ల ఖుర్‌ఆన్‌లో హెచ్చుతగ్గులయ్యే ప్రమాదం ఉండేది.

హజరత్ ఉస్మాన్ (రజి) ఈ పరిస్థితి గమనించి ముఖ్యమైన సహాబీలను సంప్రదించారు. ఈ విషయంలో సమాలోచనలు చేశారు. అందరు ఏకగ్రీవంగా ఇలా చెప్పారు: "హజరత్ అబూబకర్ (రజి) కాలంలో తయారు చేయబడిన ఖుర్‌ఆన్ ప్రతి, ఏదైతే ఉమ్ముల్ మోమినీన్ హజరత్ హఫ్సా (రజి) దగ్గర ఉందో, దాని కాపీలు తీయించి, గవర్నర్లందరి దగ్గరకు పంపాలి,

వారు దాని ప్రకారం కాపీలు తీయించి ప్రజలలో సర్వసామాన్యం చేయాలి. ప్రజల దగ్గర అంతకుముందున్న కాపీలు అనుమానాస్పదమైనవని ప్రకటించి వాటిని కాల్చివేయించాలి."

సహాబీలు ఇచ్చిన ఈ సలహా ప్రకారం అమలుచేయగ ఇబ్నె సబా, అతని ఏజంట్లు హజరత్ ఉస్మాన్ (రజి)కు, ఆయన గవర్నర్లకు వ్యతిరేకంగ అపార్థాలు సృష్టించడానికి మరింత అవకాశం లభించింది. హజరత్ ఉస్మాన్ (రజి), ఆయన గవర్నర్లు దివ్యఖుర్‌ఆన్‌ని కాల్చి దానిని అగౌరవపరిచారని చెబుతూ ప్రజలను రెచ్చగొట్టారు. వాస్తవ పరిస్థితి తెలియని ప్రజలు హజరత్ ఉస్మాన్ (రజి)ని గురించి చెడుగా ఆలోచించడం మొదలెట్టారు. వారి మనస్సులలో చెడు భావాలు కలుగనారంభమయ్యాయి.

# కుట్రల వల

అబ్దుల్లా బిన్ సబా, అతని అనుయాయులు దేశమంతటా వ్యాపించారు. అబ్దుల్లా బిన్ సబా ఉండే ఈజిప్టు, వారి కుట్రలకు కేంద్రంగా ఉండేది. హజరత్ ఉస్మాన్ (రజి)ని, ఆయన గవర్నర్లను అభాసుపాలు చేయడమే వారందరి ముఖ్య ఉద్దేశ్యం. వాస్తవ పరిస్థితి తెలియని ప్రజలు వారి విష వలయంలో చిక్కుకొని వారికి వత్తాసు పలికేవారు. రెండవ ఎత్తుగడగ వారు గవర్నర్లకు వ్యతిరేకంగ తప్పుడు నివేదికలు వ్రాసి ఖలీఫా కార్యాలయానికి పంపేవారు. వారి ఆరోపణల ఉత్తరాలు కట్టలు కట్టలుగా వస్తూ ఉండటంతో హజ్రత్ ఉస్మాన్ (రజి) సలహామండలిని సంప్రదించారు. సలహామండలి సభ్యులు ఆరోపణలను గురించి నిజానిజాలు తెలుసుకోవాలని సలహా ఇచ్చారు. ఈ పని కోసం అబ్దుల్లా బిన్ ఉమర్(రజి), ఉసామా బిన్ జైద్ (రజి), ముహమ్మద్ బిన్ ముస్లిం (రజి), అమ్మార్ బిన్ యాసిర్ (రజి)లు నియమించబడ్డారు. వారు ఆయా రాష్ట్రాలకు వెళ్ళి విచారిస్తే ఈ ఆరోపణలన్నీ అబద్ధాలు, అభూతకల్పనలని రుజువయ్యాయి. తరువాత వారు మదీనా తిరిగొచ్చి హజ్రత్ ఉస్మాన్ (రజి)కు తమ నివేదికలు సమర్పించారు. హజ్రత్ అమ్మార్ బిన్ యాసిర్ (రజి) మాత్రం మదీనా తిరిగి రాకుండా ఈజిప్టులోనే ఉండిపోయారు.

# అల్లర్లను అణచే తొలి ప్రయత్నం

దుండగులు తమ కార్యకలాపాలను యధాతథంగా సాగిస్తున్నారు. వాటిని అంతమొందించడానికి హ్రజత్ ఉస్మాన్ (రజి) ఓ పథకం రూపొం దించారు. వచ్చే ఏడు హజ్ యాత్ర సందర్భంలో గవర్నర్‌లంతా మదీనాలో సమావేశ మవుతారని, వారి పట్ల ఎవరెవరికి అభ్యంతరాలున్నాయో వారందరూ తమ ఆరోపణలు విన్పిస్తే అప్పటికప్పుడు విచారణ జరిపి నిర్ణయం తీసుకోవడం జరుగుతుందని ఆయన ప్రకటించారు.

హజ్ యాత్ర కాలం వచ్చింది. గవర్నర్‌లందరూ మదీనా చేరుకున్నారు. కాని ఆరోపణలు చేసేవారు ఎవరూ రాలేదు. నిజంగా ఎవరికైనా ఏదైనా ఆరోపణ ఉంటే కదా వచ్చేది. దీన్ని బట్టి ఈ ఆరోపణలన్నీ నిరాధారమైనవి, అభూత కల్పనలని మరోసారి రుజువయ్యాయి. ఎవరి పట్లా ఎలాంటి అన్యాయం జరగలేదు.

అప్పుడు హ్రజత్ ఉస్మాన్ (రజి) పథకం ప్రకారం సాగుతున్న ఈ కుట్రలను వమ్ముచేయడానికి ఏం చెయ్యాలని గవర్నర్‌లను, ఇతర అనుచరులను సంప్రదించారు. కుట్రదారుల పేర్లు తెలిసే ఉన్నాయి గనక వారందరిని తక్షణమే నిర్బంధించి కఠినంగా శిక్షించాలని, దాంతో ఈ అరాచకం, అల్లకల్లోలాలు అంతమయి పోతాయని వారు సలహా ఇచ్చారు. కాని హ్రజత్ ఉస్మాన్ (రజి) ఎంతో మృదుమనస్కుడు, దయార్ద్రహృదయుడు. ఆయన ఈ సలహాను త్రోసిపుచ్చుతూ "ముస్లింలలో రక్తపాతం జరిపించడం నాకేమాత్రం ఇష్టంలేద"ని అన్నారు.

# దుండగుల సరికొత్త పథకం

హజరత్ ఉస్మాన్ (రజి) గవర్నర్లను మదీనాకు పిలిచి సంప్రదింపులు జరుపుతున్నారని వినగానే దుండగులు మరో పథకం రూపొందించారు. గవర్నర్లందరు మదీన వెళ్ళడంతో, ఈ అవకాశాన్ని వినియోగించుకొంటూ ఆయా రాష్ట్రాల నుండి జనాన్ని సమీకరించి, ఒకేసారి వారందర్నీ మదీనాకు

తీసికెళ్ళాలని, అక్కడ హజరత్ ఉస్మాన్ (రజి)ని గవర్నర్లందరిని తొలిగించమని అడగాలని వారు ఎత్తుగడ వేశారు. తమ కోరికను మన్నించకపోతే ఖిలాఫత్ పదవి నుండి తొలగిపోవాలని హజరత్ ఉస్మాన్ (రజి)ను డిమాండు చేయాలని, దానికి ఒప్పుకోకపోతే కరవాలంతో విషయం తేల్చుకోవాలని పన్నాగం పన్నారు.

ఈ పథకం అమలుకావడానికి వారి ఆశలకు భిన్నంగా చాలా అలస్యం అయింది. దుండగులు ఇంకా మదీనాకు బయలుదేరకముందే గవర్నర్లంతా మదీనా నుండి తమ తమ రాష్ట్రాలకు తిరిగి వచ్చారు. అవకాశం చేజారి పోయింది. దుండగులు తెల్లబోయి ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. ఇలా పథకం పటాపంచలయిపోవడంతో అందరూ తోక ముడిచి ఎవరి ప్రాంతాలకు వారు వెళ్ళిపోయారు. ఈ సంఘటన హిజ్రీ శకం 34లో జరిగింది.

## మరో విఫలయత్నం

గత సంవత్సరం విద్రోహుల పథకం విఫలమయింది. అంచేత ఈ సంవత్సరం, అంటే హిజ్రీ శకం 35 షవ్వాల్ నెల నుండే వారు తమ పథకాన్ని అమలు పరచడం మొదలెట్టారు. హజ్ యాత్ర సాకుతో వారు బస్రా, కూఫా, ఈజిప్టుల నుండి ఒకేసారి బయలుదేరారు. మదీన మునవ్వరకు కొన్ని మైళ్ళ దూరంలో వేర్వేరు స్థలాలలో విడిది చేశారు.

హజరత్ ఉస్మాన్ (రజి)కు ఈ విషయం తెలిసింది. ఒక రోజు ఆయన నమాజు ముగించుకొని మసీదులో ప్రసంగిస్తూ ఇలా అన్నారు:

“వీరు (దుండగులు) నన్ను హతమార్చజూస్తున్నారు. వారు ఇలా చేశారంటే ముస్లింలలో ప్రతీకార జ్వాలలు చెలరేగుతాయి. వాటిని ఎవరూ అదుపు చేయలేరు. రక్తపాతం ఘోరంగ జరుగుతుంది. ఆ తరువాత తాము చేసిన దుస్సాహసానికి వారు పశ్చాత్తాపం చెందుతారు.” ప్రసంగం విన్న మదీన ప్రజలు హజరత్ ఉస్మాన్ (రజి)కు సహకరిస్తామని వాగ్దానం చేశారు. ఆ తరువాత వారు విద్రోహులను అణచివేయడానికి సన్నాహాలు కూడా ప్రారంభించారు.

విద్రోహులు ఈ పరిస్థితి చూసి భయపడ్డారు. వారు తలచింది ఒకటి, ఇక్కడ జరిగిందొకటి. మదీన ప్రజలు తమ వైపు ఉంటారనుకొన్నారు. వారి మద్దతుతో మదీన చేరి అలజడులను సృష్టిద్దామనుకొన్నారు. కాని ఇప్పుడు పరిస్థితులు తారుమారయ్యాయి. మదీనా వాసులు తమ పైనే కత్తి కట్టడానికి సిద్ధమయ్యారు. దాంతో దుండగులు పట్టణంలో అడుగుపెట్టడానికి సాహసించలేకపోయారు. ఇలా పథకం మరోసారి విఫలమవడంతో వారు అక్కడ నుండి పలాయనం చిత్తగించారు.

## ప్రయత్నం విఫలం - ప్రతిఫలం చీవాట్లు

అరాచక శక్తులు పరిస్థితి సమీక్షించడానికి సమావేశమయ్యాయి. ఖలీఫాగా ఎవరిని నియమించాలనే విషయంలో వారిలో భేదాభిప్రాయాలు వచ్చాయి. ఈజిప్టువారు హజరత్ అలి (రజి)ని ఖలీఫా చేయదలిచారు. బస్రావారు హజరత్ తల్హా(రజి)ను ఖలీఫాగ చేయదలిచారు. కూఫావారు హజరత్ జుబేర్ (రజి)ను ఖలీఫా చేయాలని పట్టుబట్టారు. చివరికి ఒక ప్రతినిధి వర్గం మొదట ఆ ముగ్గురిని కలిసి వారి అభిప్రాయం ఏమిటో తెలుసుకోవాలని నిర్ణయించారు.

ఈ ప్రతినిధి వర్గం మొదట దైవప్రవక్త (సఅసం) సతీమణుల వద్దకు వెళ్ళి ఇలా అన్నది. "మా స్వప్రయోజనం ఏమీ లేదు. మేము ఖలీఫా ముందు గవర్నర్ల పట్ల మాకున్న ఆరోపణలను తెలుపుతూ, వారందరిని తొలగించి వేయమని అడగ దలచుకున్నాం." ప్రవక్త భార్యలకు వారి ఉద్దేశ్యాల పట్ల అనుమానం కల్గింది. అందువల్ల వారు నకారాత్మక సమాధానమిచ్చి పంపివేశారు.

ప్రతినిధివర్గ సభ్యులు నిరాశచెందారు. ఆ తరువాత వారు హజరత్ అలి (రజి), హజరత్ జుబేర్ (రజి), హజరత్ తల్హా (రజి)లను ఒకరి తరువాత మరొకరిని కలిసి తమ ఉద్దేశ్యాన్ని వారికి తెలిపారు. దానికి ఆ ముగ్గురు సహాబీలు ఇలా ఒకే ఒక సమాధానమిచ్చారు: "ఈ మాత్రం పని కోసం

ఒకేసారి మూడు విభిన్న ప్రాంతాల నుండి అంతమంది మనుషులు ఎలా వచ్చారు? ఇందులో తప్పకుండా ఏదో కుట్ర ఉంది." హజ్రత్ అలీ (రజి) వారికి చీవాట్లు పెట్టారు. ప్రతినిధి బృందం కాళ్ళీడ్చుకుంటూ వెళ్ళిపోయింది.

## గండం తప్పింది

హజరత్ ఉస్మాన్ (రజి) రోజురోజుకు విషమిస్తున్న పరిస్థితులను గమనిస్తూ లోలోన బాధపడసాగారు. అరాచకం, అల్లకల్లోలాలంటే ఆయన అసహ్యించు కుంటారు. తన మూలంగా ప్రజల మధ్య హత్యా, రక్తపాతాలు జరగడం ఆయనకు సుతరామూ ఇష్టం లేదు. అంచేత ఆయన హజరత్ అలి (రజి)ని పిలిపించి ఇలా అన్నారు: "మీరు ఈ దండుగులు చేస్తున్న ఆక్షేపణలు, ఆరోపణలు ఏమిటో తెలుసుకొని రండి. అవి నిజమైన ఆరోపణలని తేలితే వాటిని సానుభూతితో పరిశీలించి తగిన చర్యలు తీసుకుంటామని చెప్పండి."

ఖలీఫా తీసికొంటున్న చర్యలు, మారుతున్న పరిస్థితులను చూసి దుండగులు నిరాశపడ్డారు. వారిలో కొందరు తమ నిర్వాహకాల పట్ల సిగ్గుపడ్డారు. హజరత్ అలి (రజి) అరాచక శక్తులతో చర్చించగ, వారు ఒక కోరికను ఆయనకు తెలియజేశారు. ఈజిప్టులో ప్రస్తుతం ఉన్న గవర్నర్ అబ్దుల్లా బిన్ అబిసరహ్‌ను తొలగించి ఆయన స్థానంలో ముహమ్మద్ బిన్ అబూబకర్‌ని నియమించమని అన్నారు వారు.

ఈ కోరిక గురించి హజరత్ ఉస్మాన్ (రజి)కు తెలియజేశారు. ఆయన వెంటనే దాన్ని అంగీకరిస్తూ అబ్దుల్లా బిన్ సరహ్‌ను తొలగించి ఆయన స్థానంలో ముహమ్మద్ బిన్ అబూబకర్ (రజి)ను గవర్నరుగ నియమిస్తున్నట్లు ఫర్మాన జారీచేశారు. ఈ మార్పుతో ఆ మూడు ప్రాంతాల ప్రతినిధి బృందం బయటికి సంతోషం వెలిబుచ్చి వెళ్ళిపోయింది. మదీనవాసులు తృప్తిగా గాలి పీల్చుకొని తమ తమ దైనందిన పనులలో నిమగ్నులైపోయారు.

# మరో కుట్ర

కొన్నాళ్ళ తరువాత ఒక రోజు మదీన వీధుల్లో అకస్మాత్తుగ అల్లాహు అక్బర్ అనే నినాదం వినబడింది. గుర్రాల గిట్టెల ధ్వనితో పట్టణం మార్మోగ సాగింది. ప్రజలు భయభ్రాంతులయి ఇండ్లలో నుంచి బయటికి వచ్చారు. చూస్తే ఈజిప్టుకు చెందిన దుండగుల ముఠా మళ్ళీ వచ్చి "బదులు తీర్చుకొంటాం, బదులు తీర్చుకొంటాం" అని కేకలు పెడ్తున్నారు. హజరత్ అలి (రజి) వచ్చి మదీనా నుండి వెళ్ళి తిరిగి రావడానికి కారణం ఏమిటని అడిగారు. దానికి ఈజిప్టు దుండగులు ఇలా అన్నారు:

"దారిలో ఖలిఫా దగ్గర్నుండి వచ్చిన ఒక నీగ్రో దూత కలిసాడు. అతను వేగంగ ఈజిప్టు వైపు వెళ్తున్నాడు. అతని ముఖం చూస్తే మాకు అనుమానం కలిగింది. ఎక్కడి నుండి వస్తున్నావని అతనిని ప్రశ్నించాం. అమీరుల్ మోమినీన్ తనను ఈజిప్టు గవర్నరు వద్దకు పంపారని అన్నాడతను. ముహమ్మద్ బిన్ అబూబకర్ (రజి) అతణ్ణి నిర్బంధంలోకి తీసుకొని నీవెవరి బానిసవని అడిగారు. అతను ఒకసారి అమీరుల్ మోమినీన్ బానిసనని, మరొకసారి మర్వాన్ బానిసనని అన్నాడు. అతడ్ని తనఖీ చేస్తే ఒక జాబు దొరికింది. ఆ జాబు అమీరుల్ మోమినీన్ తరఫున అబ్దుల్లా బిన్ సరాహ్ పేర వ్రాయబడింది. అందులో 'ముహమ్మద్ బిన్ అబూబకర్ (రజి) ఈజిప్టు చేరుకోగానే అతడ్ని, అతనితో పాటు వచ్చిన వారినందరిని చంపండని, వారివద్ద ఉన్న ఉత్తర్వును అమలు చేయనవసరం లేద'ని ఉంది."

హజరత్ అలి (రజి) ఈ వృత్తాంతం విని నిర్ఘాంతపోయారు. దీర్ఘాలోచనలో పడిపోయారు.

# దిగ్బంధం

హజరత్ అలి (రజి), మరికొందరు ఇతర సహాబీలు కలసి ఈజిప్టు దుండగుల్ని తీసుకొని హజరత్ ఉస్మాన్ (రజి) దగ్గరకు వెళ్ళారు. విషయం ఖలీఫా ముందు ఉంచారు. హజ్రత్ ఉస్మాన్ (రజి) ఆశ్చర్యపోతూ, తనకేమీ

తెలియదని అన్నారు. ప్రమాణం చేస్తూ తానసలు ఆ ఉత్తరం వ్రాయించి పంపలేదని చెప్పారు. హజరత్ ఉస్మాన్ (రజి) ప్రమాణం చేసి చెప్పినందున ఈ పనిలో ఆయన హస్తం లేదని, ఇది మర్వాన్ తలపెట్టిన విద్రోహచర్య అయి ఉంటుందని వారు నిర్ధారించుకున్నారు.

ఈజిప్టు దుండగులు ఈ అవకాశాన్ని వినియోగించుకుంటూ హజరత్ ఉస్మాన్ (రజి)ని ఖిలాఫత్ నుండి తొలిగిపోవాలని డిమాండు చేశారు. వారి వాదన ఒక్కటే: "ఏది ఏమైనా ఇంతటి ముఖ్య విషయం కూడ ఖలీఫాకు తెలియకపోవడం అవివేకం. మీకిక ఖలీఫాగా ఉండే అర్హత లేదు." హజరత్ ఉస్మాన్ (రజి) జవాబిస్తూ అన్నారు: "ఇలా ఎన్నటికీ కాజాలదు. దైవప్రవక్త (సఅసం) నాతో ఇలా అన్నారు: 'ఉస్మాన్ (రజి)! అల్లాహ్ నీకొక చొక్కా తొడిగిస్తాడు. ప్రజలు ఆ చొక్కాను తొలిగించే ప్రయత్నం చేస్తారు. ప్రజల మాటలు విని ఆ చొక్కాను తీసివేస్తే నీకు స్వర్గ సువాసన ఆఘ్రాణించే అదృష్టం ఉండదు.' ఈ జవాబు విని దుండగులు మరింత రెచ్చిపోయారు. రెచ్చిపోయి హజ్రత్ ఉస్మాన్ (రజి) ఇంటిని చుట్టుముట్టారు.

## మసీదుకు పోవడంపై ఆంక్షలు

మదీన పట్టణాన్ని విద్రోహులు ఆక్రమించుకున్నారు. వారు ఖలీఫా ఇంటిని చుట్టుముట్టినప్పటికీ, ఆయనపై ఇంకా ఎలాంటి బలప్రయోగాలు చేయడానికి సాహసించలేకపోయారు. ఆయన్ను మసీదుకు వెళ్ళడానికి అనుమతించారు. కాని ఎవరినీ కలుసుకోడానికి, మాట్లాడడానికి అనుమతి ఇవ్వలేదు.

శుక్రవారం వచ్చింది. మసీదులో నమాజు ముగిసిన తరువాత హజరత్ ఉస్మాన్ (రజి) వేదికపై ఎక్కి విద్రోహులను సంబోధిస్తూ ఇలా అన్నారు: "మీరు బాగుగ ఎరుగుదురు. మీరు చేస్తున్నటువంటి పనులు చేసేవారిని దైవప్రవక్త (సఅసం) శపించారు. మీరు ఇప్పటికైనా మీ పొరపాట్ల పట్ల

పశ్చాత్తాపం చెంది దైవశిక్ష నుండి తప్పించుకోండి." ఇలా చెప్పారో లేదో కేకలు, అరుపులతో మసీదు దద్దరిల్లిపోయింది. హజరత్ జైద్ బిన్ సాబిత్ (రజి), ముహమ్మద్ బిన్ ముస్లిం (రజి)లు, హజరత్ ఉస్మాన్ (రజి) మాటలను సమర్థించడానికి లేచి నిలబడ్డారు. కాని అల్లరిమూకలు వారిని బలవంతంగా కూర్చోబెట్టారు. ఆ వెనువెంటనే రాళ్ళవర్షం మొదలయింది. ఒక దుర్మార్గుడు హజరత్ ఉస్మాన్(రజి) చేతిలోని కర్ర లాక్కొని విరగ్గొట్టాడు. ఆ తరువాత హజ్రత్ ఉస్మాన్ (రజి) రాళ్ళదెబ్బలకు రక్తసిక్తమయి స్పృహ తప్పి పడిపోయారు. ప్రజలు ఆయన్ను ఎత్తుకొని ఇంటికి చేర్చారు.

ఆ సంఘటన తరువాత హజరత్ ఉస్మాన్(రజి) మసీదుకు వెళ్ళడంపై కూడా ఆంక్షలు విధించడం జరిగింది. గృహనిర్బంధం మరింత పటిష్టమయింది.

## అన్నపానీయాలు బంద్

విద్రోహుల దురాగతాలు చూస్తున్న మదీనా పౌరులు తీవ్ర ఆందోళన చెందసాగారు. అలి, తల్హా, జుబేర్, జైద్, సాఅద్ (రిజ్వానుల్లాహి అలైహిమ్) ఖలీఫా ఇంట్లో ప్రవేశించడానికి ప్రయత్నించారు. కాని విద్రోహులు వారిని నిరోధించారు. చివరికి ఎలాగో హజరత్ ఉస్మాన్ (రజి) గారికి విషమిస్తున్న పరిస్థితులు తెలియజేస్తూ, ఖలీఫా అనుమతిస్తే విద్రోహుల అగడాలను అరికడ్తామని అన్నారు. కాని హజరత్ ఉస్మాన్ (రజి) గట్టిగా వారిస్తూ, "నా కారణంగా ముస్లింలలో రక్తపాతం జరగడాన్ని నేను ఎంతమాత్రం సహించను. విద్రోహులు కరవాలం ఎత్తనంతవరకు, వారి మీద యుద్ధం చేయకూడదు" అని ఆదేశించారు. అమీరుల్ మోమినీన్ ఆజ్ఞ విని వారంతా మౌనంగా ఉండి పోయారు. అయితే విద్రోహులు దుశ్చర్యలకు పాల్పడకుండా ఉండేందుకు ముందు జాగ్రత్త చర్యగా కొందరు సాయుధ మనుషులను అమీరుల్ మోమినీన్ ఇంటి ముందు పహరా పెట్టారు. వారిలో హజరత్ అలి (రజి), హజరత్ తల్హా (రజి), హజరత్ జుబేర్ (రజి) కుమారులున్నారు.

విద్రోహులు ముట్టడిని మరింత కఠినం చేసి లోపలికి అన్నపానీయాలను సైతం తీసికెళ్ళనీయకుండా చేశారు. ఉమ్ముల్ మోమినీన్ హజరత్ ఉమ్మె హబీబా(రజి) అన్నపానీయాలు తీసుకొని ఖలీఫా ఇంట్లోకి వెళ్ళడానికి ప్రయత్నిస్తే దుండగులు ఆమెను కూడా అడ్డుకొని అమర్యాదగా ప్రవర్తించారు.

## మూడు ప్రతిపాదనలు

విద్రోహుల దిగ్బంధం రోజురోజుకు కఠినమయిపోతోంది. ఎవరినీ లోపలకు పోనివ్వడం లేదు. ఇంటిలో హజరత్ ఉస్మాన్ (రజి) దిక్కుతోచని పరిస్థితిలో పడి అందోళన చెందసాగారు. నగరప్రజలు కంగారుపడుతూ అమీరుల్ మోమినీన్ ఆజ్ఞ కోసం తీవ్రంగా ఎదురుచూడసాగారు.

హజరత్ ముగైరా బిన్ షొబా (రజి) ఎలాగో ఖలీఫా ఇంటిలో ప్రవేశించ గలిగారు. ఆయన అమీరుల్ మోమినీన్ ముందు మూడు ప్రతిపాదనలు ఉంచుతూ ఇలా అన్నారు: "అమీరుల్ మోమినీన్! నేను మీ ముందు మూడు మాటలు పెట్టుచున్నా. అందులో ఏదో ఒకదాన్ని అంగీకరించండి, పరిస్థితి పూర్తిగా విషమించింది. ఇక ఏమాత్రం ఆలస్యం చేయకండి."

1. మీరంటే ప్రాణాలొడ్డి పనిచేసేవారు అనేకమంది కంగారుపడుతూ మీ ఆజ్ఞ కోసం తీవ్రంగా ఎదురుచూస్తున్నారు. మీరు బయటికి వచ్చేయండి. మీ మద్దతుదారులతో కలసి విద్రోహుల పీచం అణచి వారిని నగరం నుండి గెంటివేయండి.

2. లేదా పెరటి గోడ పడగొట్టి మక్కా నగరానికి వెళ్ళిపోండి. అది పుణ్యక్షేత్రం. అక్కడ విద్రోహులు యుద్ధం చేయలేరు.

3. లేదా సిరియా వెళ్ళిపోండి. అక్కడ అమీర్ మావియ గవర్నరుగా ఉన్నారు. అన్ని ఏర్పాట్లు ఆయనే చూసుకొంటారు.

హజరత్ ఉస్మాన్ (రజి) ఈ మాటలు విని ఇలా అన్నారు:

1. నేను యుద్ధం చేసి ముస్లిం సమాజంలో రక్తపాతం జరిపించే మొదటి ఖలీఫా కాదలచుకోలేదు.

2. నేనొకవేళ మక్కా వెళ్ళిపోతే ఈ దుష్టులు దాని పవిత్రతను కూడ భంగపరిచే ప్రమాదం ఉంది. వారు అక్కడా యుద్ధం చేయకుండా ఉండలేరు.

3. నేను సిరియా కూడ వెళ్ళను. దైవప్రవక్త (సఅసం) జన్మభూమిని వదలి ఆయనకు దూరం కావడం నాకిష్టం లేదు.

హజరత్ ముగైరా (రజి) ఈ సమాధానం విని మారు మాట్లాడకుండా అక్కడ నుండి తిరిగొచ్చారు.

# హజ్ సీజన్ వచ్చింది

విద్రోహులు ఖలీఫా ఇంటిని ముట్టడించి ఒక నెల గడిచింది. పరిస్థితులు విషమిస్తున్నాయి. మదీన వాసులు ఈ అస్థిరత, అల్లకల్లోలాల పర్యవసానం ఏమవుతుందోనని భావిస్తూ ఆందోళన చెందుతున్నారు. పట్టణమంతటా విద్రోహులు వ్యాపించిపోయారు. ప్రతి మనిషీ తనకు తాను ప్రమాదంలో పడిపోయానని భావిస్తూ భయపడసాగాడు. హజ్ సీజను కూడా వచ్చింది. ప్రజలు హజ్ యాత్ర సన్నాహాలు ప్రారంభించారు. వారు మక్కాకు బయలుదేరే సమయం వచ్చింది.

అమీరుల్ మోమినీన్ హజరత్ ఉస్మాన్(రజి) ఇంటి నుండి బయటికి రాలేని పరిస్థితులు ఉన్నందున ఆయన ఇంటి కప్పు మీదికెళ్ళి హజ్ యాత్రకు వెళ్ళేవారికి హితోపదేశం చేశారు. తరువాత హజరత్ అబ్దుల్లా బిన్ అబ్బాస్ (రజి)ను యాత్రికులకు నాయకునిగా నియమించారు. హజరత్ ఆయెషా (రజి)కూడా హజ్ యాత్రకు వెళ్ళారు. విద్రోహులలో కలసి ఉన్న తన సోదరుడు ముహమ్మద్ బిన్ అబూబకర్ (రజి)ని కూడా హజ్‌కు బయలుదేరమని ఆమె అన్నారు. కాని అతను హజ్‌కు వెళ్ళడానికి నిరాకరించాడు.

హజరత్ ఉస్మాన్ (రజి) నానాటికి విషమిస్తున్న పరిస్థితుల్ని గమనిస్తూ తనను గురించి దైవప్రవక్త (సఅసం) తెలిపిన భవిష్యత్ మాటలను జ్ఞాపకం తెచ్చు కున్నారు. దాంతో ఆయన మృత్యువు తనకు అతి సమీపంలో ఉందని గ్రహించారు. దైవప్రవక్త (సఅసం) తనతో, "అలాంటి పరిస్థితులు ఎదురైనప్పుడు భయపడకూడదని, సహనం వహించాలని" అన్నారు. ప్రియప్రవక్త (సఅసం)ఉపదేశాన్ని తు.చ. తప్పకుండా పాటించడానికి ఆయన ప్రయత్నిస్తున్నారు. ప్రవక్త (సఅసం)ఉపదేశాన్ని పాటించడంకన్నా మించిన మహాభాగ్యం మరొకటి లేదని ఆయనకు బాగా తెలుసు.

## తుదకు ఖలీఫా షహీదు చేయబడ్డారు

విద్రోహులు అనేకసార్లు సమాలోచనలు జరిపారు. జిల్‌హజ్ 18వ తేదీ వచ్చింది. హజ్ సీజన్ ముగిసి హాజీలు తిరిగొచ్చే సమయం కూడా ఆసన్నమయింది. మదీన పట్టణం దాదాపు ఖాళీగా ఉంది. ఈ అవకాశం వినియోగించుకొంటూ విద్రోహులు హజరత్ ఉస్మాన్ (రజి) ఇంటిపై దాడి చేశారు. ఖలీఫా రక్షణ కోసం ఉన్న సాయుధ మనుషులు వారిని ఎదుర్కోవడానికి రంగంలోకి దిగారు. ఈ విధంగా ఖలీఫా ఇంటి ముందు యుద్ధం మొదలయింది. ఇక్కడ ఇలా యుద్ధం జరుగుతుండగానే ముహమ్మద్ బిన్ అబూబకర్ కొందరు దుండగుల్ని తీసుకొని ఇంటి వెనుక గోడ దూకి లోపలికి జొరబడ్డాడు.

హజరత్ ఉస్మాన్ (రజి) ఆ సమయంలో ఖుర్‌ఆన్ పఠనం చేస్తున్నారు. ముహమ్మద్ బిన్ అబూబకర్ దూసుకు వచ్చి ఖలీఫా గడ్డం పట్టుకొని లాగాడు. అప్పుడు హజరత్ ఉస్మాన్ (రజి), "నా సోదర కుమారా! మీ నాన్నగారు బ్రతికి ఉంటే ఆయన ఈ నిర్వాకాన్ని సహించేవారు కాదు" అన్నారు. ఈ మాట వినగానే అతను సిగ్గుపడి వెనక్కి తగ్గాడు. ఆ తరువాత వెంటనే అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు. అయితే కనాన బిన్ బషర్ అనే విద్రోహి ముందుకు వచ్చి ఖలీఫా నొసటిపై ఇనుప కడ్డీతో బలంగా కొట్టాడు. ఆ

దెబ్బకు రక్తసిక్తమయి ఖలీఫా పడిపోయారు. అదే సమయంలో సౌదాన్ ఇబ్నె హమ్రాన్ అనేవాడు కరవాలంతో ఖలీఫాపై వ్రేటు వేయబోయాడు. వెంటనే ఖలీఫా సతీమణి హజరత్ నాయిలా(రజి) భర్తను కాపాడుకోవడానికి చేతిని అడ్డం పెట్టారు. దానివల్ల ఆమె చేతి వ్రేళ్ళు మూడు తెగిపోయాయి. పాషాణ హృదయుడైన మరో విద్రోహి అమ్ర్ బిన్ హమఖ్ ఖలీఫా ఎదపై కూర్చొని బల్లెంతో తొమ్మిది పోట్లు పొడిచాడు. దాంతో అమీరుల్ మోమినీన్ హజరత్ ఉస్మాన్ (రజి) రక్తపు మడుగులో పడి అంతిమశ్వాస వదిలారు. ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజివూన్.

## అంత్యక్రియలు

హిజ్రీ శకం 35వ సంవత్సరం, జిల్‌హజ్ నెల 18వ తేదీ శుక్రవారం అసర్ నమాజు వేళ హజరత్ ఉస్మాన్ (రజి) అమరగతి నొందారు. ఆ సమయంలో ఆయన ఖుర్‌ఆన్ పారాయణం చేస్తున్నందువల్ల ఆయన శరీరం నుండి చిందిన రక్తం ఈ క్రింది ఖుర్‌ఆన్ వాక్యంపై పడింది.

فَسَيَكْفِيكَهُمُ اللّٰهُ وَهُوَ السَّمِيعُ الْعَلِيمُ ● (البقرہ ۱۳۷)

**"వారికి వ్యతిరేకంగా మీకు సహాయం చేయడానికి దేవుడే చాలు. ఆయన సమస్తం వింటున్నాడు, ఆయనకు అన్ని విషయాలు తెలుసు."**

**(అల్‌బఖర:137)**

ఈ ఖుర్‌ఆన్ ప్రతి తాష్కంట్ మ్యూజియంలో ఇప్పటికీ ఉంది. ఖలీఫా అమరగతినొందిన వార్త మదీన పట్టణంలో దావానలంలా ప్రాకింది. జనం నిర్ఘాంతపోయారు. యావత్తు పట్టణం విద్రోహుల స్వాధీనంలో ఉండటం వల్ల ఇండ్లలోనుంచి బయటికొచ్చి హజరత్ ఉస్మాన్ (రజి) భౌతిక కాయానికి అంత్యక్రియలు జరిపే ధైర్యం ఎవరికీ లేకపోయింది. చివరికి మరునాడు, అంటే శనివారం రాత్రి కొంతమంది ఎలాగో ధైర్యంచేసి అంత్యక్రియలు

జరపడానికి వచ్చారు. మృతదేహానికి స్నానం చేయించకుండానే హజరత్ జుబైర్ బిన్ అవామ్ లేక హజరత్ జుబైర్ బిన్ ముతామ్ జనాజా నమాజు చేశారు. మొత్తం 17 మంది శవాన్ని మోసుకెళ్ళి జన్నతుల్ బఖీ వెనుక భాగంలో ఉన్న కౌకబ్ అనే ప్రదేశంలో ఖననం చేశారు. కొంత కాలం తరువాత ఈ ప్రదేశాన్ని కూడ జన్నతుల్ బఖీలో చేర్చారు. మదీనా పట్టణంపై విషాద ఛాయలు అలుముకున్నాయి. ప్రతి మనిషీ ఖలీఫా మరణం పట్ల కంట తడిపెట్టాడు.

హత్య గావించబడే నాటికి హ్రజత్ ఉస్మాన్ (రజి) వయస్సు 82 సంవత్సరాలు. ఆయన దాదాపు 12 సంవత్సరాలు ఖిలాఫత్ బాధ్యతలు నిర్వహించారు.

## విద్రోహుల దుర్గతి!

సరయిన కారణం లేకుండానే విద్రోహులు కుట్ర పన్ని హజరత్ ఉస్మాన్ (రజి)ని దారుణంగా హతమార్చారు. ఇది సాధారణ విషయం కాదు. ధర్మ వ్యతిరేకతకు ప్రబల నిదర్శనం. కుట్రపూరితమైన ఈ దుష్టకార్యంలో పాలు పంచుకున్న విద్రోహులకు ఇహలోకంలోనే దేవుడు ఎలాంటి శిక్ష విధించాడో చరిత్ర తెలియజేస్తుంది.

అబూ ఖలాబ ఇలా చెబుతున్నారు: నేను సిరియాలో ఒక వ్యక్తిని చూశాను. అతను "అయ్యో! నరకాగ్ని!!" అంటూ బాధపడుతుంటాడు. అతని కాళ్ళు, చేతులు తెగి ఉన్నాయి. విషయం ఏమిటని అడిగితే అతనిలా చెప్పాడు: "హజరత్ ఉస్మాన్ (రజి)ను హతమార్చడానికి వెళ్ళినవారిలో నేనూ ఉన్నాను. నేనాయన్ని సమీపించగానే, ఆయన శ్రీమతి కేకలు పెట్టారు. నేను ఆమెకు ఒక లెంపకాయ వేశాను. ఇది చూసిన హజరత్ ఉస్మాన్(రజి) "దైవం నీ కాళ్ళు చేతులు నరికి వేయుగాక! నిన్ను నరకాగ్నిలో పడవేయుగాక!" అని శపించారు. కాళ్ళు చేతులైతే తెగిపోయాయి. నేనిప్పుడు నరకాగ్ని గురించి భయపడుతున్నాను."

యజీద్ బిన్ హబీబ్ ఇలా తెలియజేస్తున్నారు: "హజరత్ ఉస్మాన్ (రజి)కు వ్యతిరేకంగ విద్రోహ చర్యలలో పాల్గొనడానికి ఈజిప్టు నుంచి వచ్చినవారిలో ఒక్కడు కూడ మిగలకుండా అందరూ మతిస్థిమితం కోల్పోయి పిచ్చివాళ్ళయి పోయారు. నిజం చెప్పాలంటే చెడ్డ పనులలో సహకరిస్తే దాని పర్యవసానం కూడా చెడుగానే ఉంటుంది."

# ఆయన సతీమణులు

హజరత్ ఉస్మాన్ (రజి) ఎనిమిది మందిని వివాహమాడారు. ఆయన భార్యల పేర్లు ఇలా ఉన్నాయి.

**1. హజరత్ రుఖియా (రజి):** ఈమె ప్రియప్రవక్త (సఅసం) జేష్టపుత్రిక. అబిసీనియా వలస వెళ్ళే సమయంలో ఈమె హజరత్ ఉస్మాన్ (రజి)తో పాటున్నారు. అక్కడ నుండి తిరిగొచ్చి మదీన వలస పోయినప్పుడు కూడ అమె భర్తతో పాటున్నారు. మదీనా వచ్చిన ఒక సంవత్సరం తరువాత హిజ్రీ శకం 2వ ఏట చనిపోయారు.

**2. హజరత్ ఉమ్మె కుల్సూమ్ (రజి):** ఈమె కూడ ప్రియప్రవక్త (సఅసం)గారి కూతురే. హజరత్ రుఖియా (రజి) మరణానంతరం హిజ్రీ శకం 3వ సంవత్సరం హజరత్ ఉస్మాన్ (రజి) ఈమెను వివాహం చేసు కొన్నారు. హిజ్రీ శకం 9లో ఈమె కూడా చనిపోయారు. ఈమెకు సంతానం లేదు.

**3. హజరత్ ఫాఖ్తా బిన్తె గజ్వాన్:** హజరత్ ఉమ్మెకుల్సూమ్(రజి) మరణానంతరం ఈమెను వివాహమాడారు.

**4. హజరత్ ఉమ్మె అమ్ర్ బిన్తె జందబ్ దౌసి:** ఈమె దౌస్ తెగకు చెందిన స్త్రీ.

**5. హజరత్ ఫాతిమ బిన్తె వలీద్ మఖ్జూమియ**

**6. హజరత్ ఉమ్ముల్ బనీన్ బిన్తె అయినియా ఫజారియ**

**7. హజరత్ రమ్‌లా బిన్త్ షైబా**

**8. హజరత్ నాయిల బిన్త్ అల్ ఫరాఫజ కల్బియ:** ఈమె చేతి వేళ్ళు షహీద్ అయ్యాయి.

హజరత్ ఉస్మాన్ (రజి)గారు షహీద్ చేయబడ్డ సమయంలో ఫాఖ్తా, ఉమ్ముల్ బనీన్, రమ్‌ల, నాయిలా ఉన్నారు.

# సంతానం

చరిత్రలో ఆయన సంతానం గురించి ఇలా ఉంది:

**1. అబ్దుల్లా అక్బర్:** ఈయన హజరత్ రుఖియా ద్వారా కలిగిన సంతానం. ఆరు సంవత్సరాల వయస్సులో మరణించారు.

**2. అబ్దుల్లా అస్గరు:** ఈయన ఫాఖ్తా బిన్త్ గజ్వాన్ ద్వారా కలిగారు. బాల్యంలోనే చనిపోయారు.

**3. అమ్ర్, 4. ఖాలిద్, 5. అబాన్, 6. ఉమర్, 7. మర్యం:** వీరందరు ఉమ్మె అమ్ర్ బిన్త్ జన్‌దబ్‌గారి ద్వారా జన్మించిన సంతానం. వీరిలో అబాన్ సుప్రసిద్ధులు. హదీసు, ఫిఖా విద్యలలో గొప్ప పండితులు. మదీనాలోని పది మంది సుప్రసిద్ధ ఫిఖ్హా పండితులలో ఈయన ఒకరు. అబ్దుల్ మలిక్ బిన్ మర్వాన్ పాలనాకాలంలో ఈయన ఏడున్నర సంవత్సరాల పాటు మదీనా గవర్నరుగా పని చేశారు.

**8. వలీద్, 9. సయీద్, 10. ఉమ్మె సయీద్:** ఈ ముగ్గురు ఫాతిమ బిన్త్ వలీద్ ద్వారా అయిన సంతానం. హజరత్ అమీర్ మావియా (రజి), హజరత్ సయీద్ గారిని ఖరాసాన్ గవర్నరుగ నియమించారు. ఈయన సమర్ఖండ్‌ను జయించారు.

**11. అబ్దుల్ మలిక్:** ఈయన ఉమ్ముల్ బనీన్ అయినియా ద్వారా అయిన సంతానం. బాల్యంలోనే మరణించారు.

**12. ఆయిషా, 13. ఉమ్మె అబాన్, 14. ఉమ్మె అమ్ర్:** ఈ ముగ్గురు రమ్లా బిన్త్ షైబా ద్వారా జన్మించారు.

**15. మర్యం:** ఈమె నాయిలా బిన్త్ ఫరాఫ్జా ద్వారా జన్మించారు. బాల్యంలోనే మరణించారు.

## ఆయన (రజి) గుణగణాలు, రూపురేఖలు

హజరత్ ఉస్మాన్ జున్నూరైన్ (రజి)గారి ఎత్తు మధ్యస్తంగా, ముఖం అందంగా, వర్ణం చామనఛాయగా ఉండేవి. ముక్కు పొడుగ్గా మొన తేలి ఉండేది, చెంపలపై అక్కడక్కడ మశూచికపు మచ్చలు ఉండేవి. ఎత్తయిన రొమ్ము, మెరిసే పళ్ళు. గడ్డం గుబురుగా, పొడుగ్గా ఉండేది. శిరోజాలు దట్టంగ చెవుల వరకు పొడవుగా ఉండేవి. వాటికి నల్లరంగు వేసేవారు.

ఆయన మంచి స్వభావం కలవారు. పరిశుభ్రమైన సాదా దుస్తులు మాత్రమే ధరించేవారు. అత్తరు కూడా పూసుకునేవారు. అహంభావం, ప్రదర్శనా భావోద్రేకాలు రేకెత్తించే బట్టలు ధరించేవారుకారు. సాధారణంగ లుంగీ కట్టేవారు. అమరగతినొందే నాడు మాత్రం మర్మాంగాలపై బట్ట తొలగకుండా ఉండేందుకు పైజామా ధరించారు. ఆయన మూర్తీభవించిన బిడియస్తులు. వృద్ధాప్యంలో బలహీనత వల్ల తొందరగా జీర్ణమయ్యే తేలికపాటి ఆహార పదార్థాలను తీసుకునేవారు. భోజన సమయంలో ఆయనతో పాటు, ఆయన బంధుమిత్రులు కూడా ఉండేవారు.

రాత్రి సమయం ఎక్కువగా ఆరాధనలో గడిపేవారు. అప్పుడప్పుడు రాత్రంతా మేల్కొని ప్రార్థన చేసేవారు. ఒకే రకాతులో పూర్తి ఖుర్‌ఆన్ పఠించేవారు. రెండు మూడు రోజులకొకసారి ఉపవాసం ఉండేవారు. ఒక్కొక్కసారి నెలల తరబడి కూడా ఉపవాసం పాటించేవారు. ఎంత మంచివారో మన అమీరుల్ మోమినీన్ చూడండి.

## దైవభీతి

యావత్తు సత్కార్యాలకు దైవభీతి పునాది లాంటిది. హృదయంలో దైవభీతి లేనివారు ఎలాంటి సత్కార్యమైనా చేస్తారని ఆశించలేము.

హజరత్ ఉస్మాన్ (రజి) కళ్ళు తరచూ దైవభీతి కారణంగా అశ్రుపూరితాలయి ఉండేవి. ఎదురుగా ఎవరిదైనా జనాజా (శవం) వస్తుంటే ఆయన లేచి నిలబడేవారు. పరలోక పరిణామాలను తలచుకొని దుఃఖించే వారు. సమాధుల సమీపం నుండి పోవడం జరిగినప్పుడు ఆయన గడ్డం తడిసి పోయేటంత ధారాపాతంగా కన్నీరు కార్చేవారు. ఒకసారి ప్రజలు ఆయనతో మాట్లాడుతూ, "మహాశయా! స్వర్గనరకాల ప్రస్తావన విని మీరంతగా స్పందించరు, కాని సమాధులను చూస్తే మాత్రం కంపించిపోతారేమిటీ?" అని అడిగారు. దానికి ఆయన ఇలా జవాబిచ్చారు: "దైవప్రవక్త(సఅసం) అన్నారు: 'సమాధి తీర్పు దినపు మొదటి గమ్యం. ఈ గమ్యాన్ని సులభంగా దాటగలిగితే ఆ తరువాత వచ్చే గమ్యాలను మరింత సులభంగా దాటగలం. ఒకవేళ ఈ గమ్యాన్ని దాటడంలో చిక్కులు ఏర్పడితే మిగిలిన గమ్యాలను గురించి చెప్పలేము. దేవుడే కాపాడాలి."

ఒకసారి హజ్రత్ ఉస్మాన్ (రజి) తన బానిసకు శిక్షగా అతని చెవి మెలేశారు. కాని అంతలో ప్రతీకారం సంగతి గుర్తొచ్చి, "నువ్వు కూడ నా చెవి మెలెయ్యి. పరలోకంలోని ప్రతీకారం కంటే ఇక్కడి ప్రతీకారమే ఎంతో మంచిది" అని అన్నారు.

## ప్రియప్రవక్త (సఅసం) పట్ల ప్రేమ

హజరత్ ఉస్మాన్ (రజి)కు దైవప్రవక్త ముహమ్మద్ (సఅసం) పట్ల అపారమైన ప్రేమ ఉండేది. ఎట్టి పరిస్థితిలో కూడా ఆయన దైవ ప్రవక్త(సఅసం)ను వదలి ఉండేవారు కాదు. ప్రియప్రవక్త (సఅసం) పాల్గొన్న యుద్ధాలన్నిటిలో ఆయన పాల్గొన్నారు. ఒక్క బదర్ యుద్ధంలో మాత్రం పాల్గొనలేకపోయారు. అప్పుడు హజరత్ రుఖియా (రజి) వ్యాధిగ్రస్తులయి

ఉన్నారు. అందువల్ల స్వయంగా దైవప్రవక్తే (సఅసం) ఆమె సపర్యల కోసం మదీనాలోనే ఉండమని ఆయనకు చెప్పారు.

ప్రియప్రవక్త (సఅసం)కు ఏదైనా కష్టం కలిగిందంటే హజరత్ ఉస్మాన్ (రజి) ఎంతో బాధపడేవారు. ఒకసారి ప్రియప్రవక్త (సఅసం) ఇంట్లో వరుసగా నాలుగు రోజులు పస్తులు గడిచాయి. ప్రియప్రవక్త (సఅసం), ఆయన కుటుంబీకుల ఆర్థిక పరిస్థితి దారుణంగా ఉందని తెలిసినప్పుడు హజరత్ ఉస్మాన్ (రజి) చాలా బాధపడ్డారు. వెంటనే ఆయన ఒక సంచిలో సత్తుపిండి, మేక మాంసం, ఎండు ఖర్జూరాలు, మూడు వందల రూపాయలు నగదు సేవకునికి ఇచ్చి ప్రియప్రవక్త (సఅసం) ఇంటికి పంపారు. ఆ తరువాత కాస్సేపటికే ఆహార పదార్థాలను వండడానికి ఆలస్యమవుతుందని, వండిన పదార్థాలు తీసుకొని స్వయంగా ఆయనే వెళ్ళారు. ప్రియప్రవక్త (సఅసం) సంతోషించి, "ఓ అల్లాహ్! నేను ఉస్మాన్ (రజి) పట్ల సంతోషించాను. నీవు కూడా ఇతని పట్ల సంతోషించు" అని ప్రార్థించారు.

## ప్రవక్త (సఅసం) పట్ల గౌరవమర్యాదలు

హజరత్ ఉస్మాన్ (రజి) ప్రియప్రవక్త (సఅసం) పట్ల ఎంతో గౌరవ మర్యాదలతో ప్రవర్తించేవారు. ఏ విషయంలోనూ ఆయన (సఅసం) గౌరవానికి భంగం వాటిల్లినట్లు అనుమానం కూడ రాకుండా వ్యవహరించేవారు.

హజరత్ ఉస్మాన్ (రజి) తన హస్తాన్ని ప్రియప్రవక్త (సఅసం) చేతిలో పెట్టి ఆయన పట్ల విధేయతకు కట్టుబడి ఉంటానని ప్రతిజ్ఞ చేసిన నాటి నుంచి, ఆ చేత్తో ఎన్నడూ ఎలాంటి అపవిత్ర వస్తువును ముట్టుకోలేదు.

ప్రియప్రవక్త (సఅసం) కుటంబీకులపై, ఆయన సతీమణులపై హజరత్ ఉస్మాన్(రజి) ప్రత్యేక శ్రద్ధ వహించేవారు, వారి సేవ చేయడానికి ఎప్పుడు అవకాశం దొరుకుతుందా అని చూసేవారు. ఎల్లప్పుడూ ఇతరులకంటే ప్రవక్త (సఅసం) కుటుంబానికే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చేవారు. ఆయన ఖలీఫాగా ఉన్న రోజుల్లో పింఛన్‌దారులకు రమజాన్ దినసరి భత్యం

నిర్ణయిస్తున్నప్పుడు ఇతరులకు నిర్ణయించినదానికి రెట్టింపు భత్యం ప్రవక్త సతీమణులకు నిర్ణయించారు. దీన్నిబట్టి దైవప్రవక్త (సఅసం) సతీమణుల అవసరాల పట్ల ఆయనకు ఎంత శ్రద్ధ ఉండేదో అర్థమవుతోంది.

## ప్రవక్త (సఅసం) సంప్రదాయాల అనుసరణ

ప్రియప్రవక్త (సఅసం) పట్ల అభిమానం, విశ్వసనీయతలకు ప్రబల నిదర్శనం ఆ మహనీయుని ప్రతి మాటనూ, ప్రతి ఆచరణనూ ప్రాణప్రదంగా అనుసరించడమే.

ఒకసారి హజరత్ ఉస్మాన్ (రజి) ఉజూ చేసిన తరువాత నిలబడి చిరునవ్వు నవ్వారు. ప్రజలు ఆయన్ను, "ఏ కారణం లేకుండ నవ్వు తున్నారేమిటీ?" అని అడిగారు. దానికి ఆయన, "మన ప్రియప్రవక్త (సఅసం) ఒకసారి ఇలాగే ఉజూ చేసి చిరునవ్వు నవ్వడం చూశాను" అని సమాధాన మిచ్చారు. ఒక రోజు తన ముందు నుంచి ఒక జనాజా (శవం) పోతుంటే చూసి వెంటనే లేచి నిలబడ్డారు. తరువాత, "మన ప్రియప్రవక్త (సఅసం) ఇలాగే చేస్తుండే వారు" అని చెప్పారు జనంతో.

ఒకసారి ఆయన అసర్ నమాజు వేళ అందరి ముందు ఉజూ చేసి చూపించి మన ప్రియప్రవక్త (సఅసం) ఇలాగే ఉజూ చేసేవారని చెప్పారు.

## ఆయన పరమ బిడియస్తుడు

హజరత్ ఉస్మాన్ (రజి) సిగ్గుపడే మనస్తత్వం కలవారు. బిడియంలో ఆయన్ని మించినవారు ఎవరూ లేరు. ప్రియప్రవక్త (సఅసం) హజరత్ ఉస్మాన్ (రజి) సిగ్గు విషయంలో ఎంతో జాగ్రత్త వహించేవారు.

ఒకసారి ప్రియప్రవక్త (సఅసం) అనుచరులతో ముచ్చటిస్తున్నారు. అందరూ ఉల్లాసంగా ఉన్నారు. ప్రియప్రవక్త (సఅసం)గారి కట్టుగుడ్డ తొలిగి తొడ భాగం కొద్దిగ కనపడసాగింది. కాస్సేపటికి హజరత్ ఉస్మాన్ (రజి) వస్తున్నారని తెలిసింది. వెంటనే ప్రియప్రవక్త (సఅసం) మోకాళ్ళ నుంచి

పైభాగం కనపడకుండా బట్టలు సర్దుకొని సరిగా కూర్చున్నారు. ఇలా జాగ్రత్త పడడం గమనించిన అనుచరులు కారణం అడిగారు. దానికి ప్రియప్రవక్త (సఅసం) సమాధానమిస్తూ, "ఉస్మాన్ (రజి) చాలా బిడియస్థుడు, ఆయన బిడియం పట్ల దైవదూతలు కూడ సిగ్గుపడతారు" అని చెప్పారు.

ఒకసారి ప్రియప్రవక్త (సఅసం) ప్రజలకు హితోపదేశం చేస్తూ, "ప్రజలారా! మీరు (ఒంటరిగా ఉన్నప్పుడు కూడా అనవసరంగా) దిశమొలతో ఉండకండి. మీ వెంట దైవదూతలు ఎల్లప్పుడూ ఉంటారు. వారు మీ నుండి ఒక్క క్షణం కూడా వేరయి ఉండరు" అని చెప్పారు. ఈ మాట విన్నప్పటి నుండి హజరత్ ఉస్మాన్ (రజి) దాని పట్ల ఎంతో శ్రద్ధ తీసుకొనేవారు. చివరికి తలుపులు మూసిన గదిలో కూడ నగ్నంగా ఉండేవారు కాదు. సిగ్గు వల్ల ఆయన నిలుచుండి కూడ స్నానం చేసేవారు కాదు. చూశారా! హజ్రత్ ఉస్మాన్ (రజి) ఎంత బిడియస్తులో!!

దైవం మనకు కూడా అలాంటి బిడియం కలిగి ఉండే సద్బుద్ధి ప్రసాదించుగాక!

## ఆయన ఎంతో సహనశీలి

హజరత్ ఉస్మాన్ (రజి) బిడియంతో పాటు ఎంతో సహనం కూడా కలవారు. ఆయన ఎక్కడున్నా, ఏ పరిస్థితిలో ఉన్నా ఎవరి మీదా ఆరోపణ చేసేవారు కాదు. ఆయన ఆరోపణ చేయడం ఎవరూ వినలేదు. ఎల్లప్పుడు సహనం వహిస్తూ దైవానికి కృతజ్ఞత తెలుపుకొనేవారు. విద్రోహులు ఆయన్ని నానా విధాల హింసించి హతమార్చిన సంఘటనే దీనికి ప్రబల నిదర్శనం. దుండగులు నలభై రోజులదాకా ఆయనను ఇంట్లోనే దిగ్బంధించి ఉంచారు. ఎక్కడికీ వెళ్ళనివ్వలేదు. అన్నం నీళ్ళు కూడ ఆయన వద్దకు చేరనివ్వలేదు. ఎవ్వరిని రానివ్వలేదు కూడ. ఆయన పట్ల ప్రేమ కలవారు, ఆయనంటే ప్రాణాన్ని త్యాగం చేసేవారు "విద్రోహుల విషయం మాకు వదలండి, మేము చూసుకొంటాం" అని ఎన్నో సార్లు అనుమతి అడిగారు. కాని హజరత్ ఉస్మాన్

(రజి) ప్రతిసారి వారికి అనుమతి ఇవ్వడానికి నిరాకరించేవారు. పైగా వారికి సహనం వహించమని చెప్పేవారు. చివరికి పరిస్థితి విషమించినప్పుడు అనుమతించమని హజరత్ ఉస్మాన్(రజి) ఆత్మీయులు పదే పదే విన్నవించు కొన్నారు. కాని హజరత్ ఉస్మాన్ (రజి) ఇచ్చిన జవాబు చూడండి: "ఈ సమయంలో అందరిని మించి సహాయపడేవారు, నా కోసం కరవాలాన్ని పట్టేవారు ఉన్నారు; కాని ముస్లింల మధ్య సంక్షోభం చెలరేగడం, పరస్పరం తగవులాడి రక్తాన్ని చిందించుకోవడం నాకు ఇష్టంలేద"ని ఆయన అన్నారు. విద్రోహులు పెట్టిన కష్టాలన్నిటినీ ఓర్పుతో భరించారు, చివరకు ప్రపంచాన్ని వదలి వెళ్లారు.

## ఆయన ఉదార స్వభావం కలవారు

హజరత్ అబూబకర్ (రజి) ఖలీఫాగ ఉన్నప్పుడు ఒకసారి మదీనలో గడ్డు పరిస్థితులు ఏర్పడ్డాయి. క్షామం ప్రజలను పీడించసాగింది. తిండి గింజలకు ప్రజలు కటకటలాడిపోయారు. యాదృచ్ఛికంగ ఆ కాలంలో హజరత్ ఉస్మాన్ (రజి) గారి వెయ్యి ఒంటెలు ధాన్యంతో మదీన వచ్చాయి. మదీన వ్యాపారస్థులు ధాన్యాన్ని కొనడానికి పరుగెత్తుకుంటూ వచ్చారు. హజరత్ ఉస్మాన్ (రజి) ఆ వ్యాపారస్తులతో ధాన్యంపై ఎంత ధర చెల్లిస్తారో అడిగి తెలుసుకున్నారు. వచ్చే లాభం కూడ అడిగారు. వారందరు పది రూపాయల సరుకుపై పన్నెండు రూపాయలు ఇస్తామన్నారు. హజరత్ ఉస్మాన్ (రజి) తనకు అంతకుమించిన లాభం వస్తుందని అన్నారు. ఈ విధంగా బేరసారాలు సాగాయి. వ్యాపారస్తులు మళ్ళీ పది రూపాయల ధాన్యంపై పదిహేను రూపాయలు చెల్లిస్తామన్నారు. దానికి హజరత్ ఉస్మాన్ (రజి) తనకు అంతకంటే ఎక్కువ లాభం వస్తుందని అన్నారు. కొనుగోలుదారులకు ఆశ్చర్యం వేసింది. "మదీన వ్యాపారస్థులందరూ ఇక్కడే ఉన్నారు. మాకంటే అధిక లాభం ఇచ్చే వ్యాపారి ఎవ్వరో చెప్పండి" అన్నారు వారు. హజరత్ ఉస్మాన్ (రజి) ఒక రూపాయి సరుకుపై తనకు పది రూపాయలు లభిస్తాయి అన్నారు.

వ్యాపారస్థులు ఈసారి మరింత ఆశ్చర్యపోయారు. ఒకరి ముఖాలు మరొకరు చూసుకున్నారు. చివరికి హజరత్ ఉస్మాన్ (రజి) ఇలా అన్నారు, "మిారందరిని సాక్షులుగ చేసి చెబుతున్నా, ఈ ధాన్యాన్నంతటిని నేను దైవప్రసన్నత కోసం నిరుపేదలకు దానం చేస్తున్నాను. అల్లాహ్ ఒక పుణ్యకార్యం చేస్తే దానికి పదిరెట్లు ప్రతిఫలం ప్రసాదిస్తాడు." చూశారా! హజరత్ ఉస్మాన్ (రజి) ఎంత ఉదార స్వభావం కలవారో.

## మాటల్లో మృదు స్వభావి

హజరత్ ఉస్మాన్ (రజి) ఎంతో మృదు స్వభావి. అంతేకాదు ఆయన వాగ్ధోరణి కూడ మృదువయినదే. మధురమైన మాటలతో పలకరించేవారు. కఠినంగా, కరకుగా మాట్లాడేవారికి కూడా ఆయన మృదువుగా జవాబిచ్చేవారు. ఎవరినీ ఆయన మందలించలేదు, పరుష పదాలతో పలుకరించనూలేదు.

ఒకసారి హజరత్ అమ్ర్ బిన్ ఆస్(రజి) మాటల సందర్భంగా హజరత్ ఉస్మాన్ (రజి) గారి మృదువైఖరి గురించి ఒక ఎత్తిపొడుపు మాటన్నారు. దానికి హజరత్ ఉస్మాన్ (రజి), "ఉమ్ర్! ఇస్లామీయ పరిపాలన కాలంలో అనాగరిక, అజ్ఞాన కాలంనాటి ప్రస్తావన చేయడం సబబు కాదు" అన్నారు మృదువుగా. హజరత్ అమ్ర్ బిన్ ఆస్ (రజి) ఈ సమాధానం విని సిగ్గుతో తలదించుకున్నారు.

ఇలాంటిదే మరొక సంఘటన. ఓ శుక్రవారం రోజు హజ్రత్ ఉస్మాన్ (రజి) మసీదులో ప్రసంగ వేదికపై నిలబడి ఉపన్యసిస్తున్నారు. కాస్సేపటికి శ్రోతల నుండి ఓ కంఠస్వరం వినబడింది. "ఉస్మాన్ (రజి)! క్షమాపణ వేడుకో, మితిమీరవద్దు." ఆయన వెంటనే కాబా వైపు ముఖం చేసి, "ఓ అల్లాహ్! నీ దివ్య సన్నిధిలో క్షమాపణ వేడుకునేవారిలో నేను ప్రథముడను" అన్నారు.

చూశారా! ఎంతటి మృదు స్వభావమో ఆయనది. "దేవా! మమ్మల్ని కఠినంగా, కరకుగా మాట్లాడేలా చేయకు. ఎల్లప్పుడు మృదువుగా, మధురంగా మాట్లాడే స్వభావం మాకు ప్రసాదించు."

# మంచి నడవడిక కలవారు

హజరత్ ఉస్మాన్ (రజి) బంధువుల పట్ల ఎల్లప్పుడూ మంచిగ ప్రవర్తించేవారు. సమయం వచ్చినప్పుడు వారినాదరించేవారు. వారి అవసరాలను తీర్చేవారు. ఏ సహాయం చేసినా మరొకరికి తెలియకుండా మౌనంగ చేసేవారు.

హజరత్ హకమ్ బిన్ ఆస్ (ఉస్మాన్-రజి-ని ఇస్లాం స్వీకరించినందుకు తాడుతో కాళ్ళుచేతులు కట్టేసిన వ్యక్తి)కు ప్రియప్రవక్త (సఅసం) దేశబహిష్కరణ శిక్ష విధించి తాయిఫ్‌కు పంపివేశారు. హజరత్ ఉస్మాన్ (రజి) ఎంతో ప్రయత్నం చేసి ఆయన చేసిన తప్పును క్షమింపజేశారు. ఆయన ఖలీఫాగ ఉన్న సమయంలో మదీన పిలిపించుకొన్నారు. పైగా ధనసహాయం చేశారు. ఇదే విధంగ ఇతర బంధువులను కూడ వారి పరిస్థితులను బట్టి ఉద్యోగాలిచ్చి సహాయపడ్డారు.

స్నేహితుల పట్ల కూడా ఆయన ఇలాగే ప్రవర్తించారు. వారికి అవసరమైనప్పుడు పెద్ద పెద్ద మొత్తాలను అప్పుగా ఇచ్చేవారు. కొన్ని సందర్భాలలో ఆ మొత్తాలను వాపసు కూడ తీసికొనేవారుకాదు. ఒకసారి హజరత్ తల్హా (రజి) ఒక పెద్ద మొత్తం అప్పుగ తీసుకున్నారు. కొన్నాళ్ళ తరువాత తల్హా (రజి) డబ్బు వాపసు చేయడానికి వచ్చారు. హజరత్ ఉస్మాన్ (రజి) ఆ డబ్బును తీసికోవడానికి నిరాకరిస్తూ, "ఇది మీరు నా పట్ల చూపిన సోదరభావానికి ప్రతిఫలం" అన్నారు.

## ఆయన చదవడం, వ్రాయడం నేర్చిన వ్యక్తి

హజరత్ ఉస్మాన్ (రజి)కు బాల్యం నుండే చదవడం, వ్రాయడం అంటే ఎంతో ఇష్టం. స్వయంగ చదువును ప్రారంభించారు. నేర్చిన చదువుల్లో ప్రవీణత సాధించారు కూడ. మక్కా పట్టణంలో చదువు నేర్చిన పండితులలో ఆయన ఒకరు.

ఆ తరువాత ఆయన ముస్లిం అయి ప్రియప్రవక్త (సఅసం) ఆప్తమిత్రులలో ఒకరయ్యారు. ఆయన తనకున్న విద్యాయోగ్యతలతో ప్రియప్రవక్త (సఅసం)కు ఎంతో ప్రయోజనం చేకూర్చారు. దైవవాణి అవతరించినప్పుడల్లా ప్రియప్రవక్త (సఅసం) హజరత్ ఉస్మాన్ (రజి)ని పిలిపించి దాన్ని వ్రాయించేవారు. హజరత్ ఆయిషా (రజి) ఒకసారి ఇలా అన్నారు: "ఒక రోజు రాత్రి వేళలో దైవవాణి అవతరించింది. హజరత్ ఉస్మాన్ (రజి) అక్కడే ఉన్నారు. ప్రియప్రవక్త (సఅసం) దైవవాణిని వ్రాయమని ఆజ్ఞాపించారు. వెంటనే హజ్రత్ ఉస్మాన్ (రజి) ప్రవక్త ఆజ్ఞను శిరసా వహించారు."

ఆయన వ్రాసే శైలి అద్భుతమైనది. ఆయన వ్రాతను చూసి చదివేవారు తప్పకుండా ప్రభావితులయ్యేవారు. అందువలన ప్రియప్రవక్త (సఅసం) తన వ్యక్తిగతమైన ఉత్తరాలను కూడ ఆయనతోనే వ్రాయించేవారు.

## ఆయన సాధించిన ఘనకార్యాలు

హజరత్ ఉమర్(రజి) పరిపాలన వ్యవహారాలలో ఎంతో ప్రతిభాశాలి. వివేక విచక్షణలతో పనిచేశారు. ఆచరణాత్మక శక్తితో ఇస్లామీయ సామ్రాజ్యాన్ని విస్తరింపజేశారు. విరోధులు ఆయన సాధించిన ప్రగతి చూసి మండి పోయేవారు. కాని హజరత్ ఉమర్ (రజి) కన్ను మూయగానే శత్రువులు వివిధ ప్రాంతాలలో కుట్రలు, కల్లోలాలు ప్రారంభించారు. ఇట్టి అరాచక శక్తుల్ని అణచివేసి రాజ్యంలో ప్రశాంతత నెలకొల్పే బాధ్యత ఆయన భుజస్కంధాలపై పడింది. హజరత్ ఉస్మాన్ (రజి) ధైర్యస్థయిర్యాలతో, మనోబలంతో విద్రోహులను, ఇస్లాం వ్యతిరేక శక్తులను అణచివేశారు. మరోసారి వారు తలెత్తకుండా చేశారు. హజరత్ ఉస్మాన్ (రజి) ఏ కొద్ది చనువిచ్చి ఉన్నా ఇస్లాం వ్యతిరేక శక్తులు ఇస్లామీయ సామ్రాజ్యాన్ని పూర్తిగా తుడిచిపెట్టి ఉండేవి.

దుష్టశక్తులను అణచివేయడమే కాకుండా దూర దూర భూభాగాల వరకు ఆయన సామ్రాజ్యాన్ని విస్తరింపజేశారు. ఆఫ్రికాలో తరాబుల్స్, బర్ఖా, మరాకష్ దేశాలను జయించారు. ఈరాన్‌పై పూర్తి అదుపు సాధించారు. దాని పరిసర ప్రాంతాలను కూడా ఇస్లామీయ సామ్రాజ్యంలో చేర్చారు. అఫ్గనిస్తాన్, ఖజగిస్తాన్, తుర్కిస్తాన్‌లోని ఒక భాగం, మరోవైపు ఆర్మీనియా, అజర్‌బైజాన్‌లను కూడ వశపరచుకొన్నారు.

ఆసియామైనర్‌లో కూడా కొంత భూభాగం ఇస్లామీయ సామ్రాజ్యంలో చేరింది. ఇస్లామీయ నౌకాదళం సైప్రస్‌ను, ఇతర ద్వీపములను వశపరచుకొని రోమన్ సముద్రయాన సైన్యాన్ని నీటిలో ముంచేసి దాని నడుము విరిచింది.

## పరిపాలన తీరు

ఇస్లామీయ పరిపాలన పరస్పర సలహాలపై ఆధారపడి పని చేస్తుంది. హజరత్ ఉమర్ (రజి) సలహా మండలిని ఏర్పరచి రాజ్యపాలన విధానం చట్టబద్ధం చేశారు. హజరత్ ఉస్మాన్ (రజి) ఖలీఫాగ రాజ్య బాధ్యతలు చేపట్టాక ఈ ఏర్పాటు మొదటి ఆరు సంవత్సరాల వరకు ఇలాగే సాగింది. క్రమేణ కొన్ని కారణాల వల్ల అందులో బలహీనత వచ్చింది. అయినప్పటికీ ఎవరైన, ఏదైన లోపాన్ని వేలెత్తి చూపితే హజరత్ ఉస్మాన్ (రజి) వెంటనే చర్య తీసికొనేవారు, లోపాన్ని తొలిగించేవారు. సలహా ఇచ్చేవారు, అల్పులు, అధికులు అని చూడకుండా మంచి సలహాలన్నిటిపై అమలుచేసేవారు.

ప్రజలకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలుండేవి. ప్రభుత్వంపైకాని, అధికారులు పనిచేసే తీరుతెన్నులపై ప్రతి ఒక్కరికి అభ్యంతరాలు, ఆరోపణలు చేసే హక్కు ఉండేది. ఒకప్పుడు కూఫా గవర్నరుగ ఉన్న వలీద్ బిన్ అఖ్బాపై మద్యపానం చేశాడన్న ఆరోపణ వచ్చింది. వెంటనే హజరత్ ఉస్మాన్ (రజి) ఆయనను గవర్నరు పదవి నుండి తొలగిస్తూ, మద్యపానం చేసినందుకు శిక్ష (హద్) వేశారు కూడ.

ఇదే విధంగ అబ్దుల్లా ఇబ్నె సయీద్ ప్రదర్శించిన రణరంగ సాహసాలు ఆయన సాధించిన పనులను చూసి సంతోషపడ్డారు, బహుమానంగా ఆయనకు సమరసొత్తులో ఐదవ భాగం ఇచ్చారు. అనేకమంది దానిపై అభ్యంతరం తెలుపుకొన్నారు. హజరత్ ఉస్మాన్ (రజి) ఇచ్చిన అధిక డబ్బును వెంటనే సర్కారు ఖజానాలో జమ చేయించారు.

## సలహామండలి

ప్రాంతీయ పాలనను చక్కబెట్టడానికి ఆయా రాష్ట్రాల గవర్నర్లను సమావేశపరచి వారిని సలహామండలి సభ్యులుగ చేశారు. ఈ సలహా మండలి ప్రతి సంవత్సరం హజ్ సమయంలో కలిసేది. గవర్నర్లందరు అందులో ఉండే వారు. ప్రజలు తమ కష్టాలను, ఇబ్బందులను సలహామండలి ఎదుట సమర్పించు కొనేవారు. సలహామండలిలో చర్చించాక వాటిపై నిర్ణయాలు తీసుకొనేవారు. గవర్నర్లు తమ తమ ప్రాంతాల విషయంలో వ్రాతపూర్వకమైన నివేదికలు తెచ్చేవారు. ఏ గవర్నరు విషయంలోనైనా సరే ప్రజలకు ఎలాంటి అభ్యంతర మున్న వారా విషయం నిర్భయంగా తెలుపుకోవచ్చు. విషయ పరిశీలన చేసిన తరువాత లోపాన్ని సరిదిద్దేవారు. ఏదైనా విషయం చాలా క్లిష్టంగా వుంటే ఒక పరిశీలక బృందం నియమించబడేది, ఆ బృందం సమస్యను పరిశీలన చేశాక ఆ విషయంలో తగిన నిర్ణయం తీసుకొనేవారు.

సాధారణంగా సలహామండలిలో ఉన్న వ్యక్తులు:

1. ముహమ్మద్ బిన్ ముస్లిమా
2. అబ్దుల్లా బిన్ ఉమర్
3. ఉసామ బిన్ జైద్.

ఈ సలహామండలిలో గవర్నర్లు, అధికారులు, ఎగ్జక్యూటివ్ ఆఫీసర్ల విషయంలో పరిశీలన జరిగేది. ఉస్మాన్ (రజి) స్వాభావికంగ మృదు స్వభావం కలవారు. కఠిన హృదయులు కారు. కాని ఏదైన నివేదికపై చర్చ జరిగితే

జాగ్రత్తగా పరిశీలన చేసేవారు, లోపాన్ని వదిలేవారుకారు. పట్టుకొన్న తప్పును తొలగించేవరకు చొరవ తీసికొని కృషి చేసేవారు.

## దేశ పాలన

దేశ పరిపాలన విషయంలో హజరత్ ఉమర్ (రజి) చేసిన నిబంధనలు, నియమాలు పరిపూర్ణంగా ఉండేవి. కాని ఆచరణాత్మకంగా ఎక్కడెక్కడ ఏవైన మార్పులు చేర్పులు చేయవలసివస్తే వాటిని హజరత్ ఉస్మాన్ (రజి) సవరించేవారు.

హజరత్ ఉమర్ (రజి) సిరియా దేశాన్ని మూడు రాష్ట్రాలుగా విభజించారు. కాని హజరత్ ఉస్మాన్ (రజి) సిరియాను ఒకే రాష్ట్రంగా నిర్ణయించారు. క్రొత్తగా వశం చేసుకొన్న ప్రాంతాలను వేరు వేరు రాష్ట్రాలుగా నిర్ణయించారు.

హజరత్ ఉమర్ (రజి) కాలంలో రాష్ట్రాల సాధారణ పరిపాలనా బాధ్యతతో పాటు సైనిక బాధ్యతను ఒకే వ్యక్తిపై మోపారు. అతడు ఆ రాష్ట్రానికి సర్వాధికారాలుకల గవర్నరుగా ఉండేవాడు. హజరత్ ఉస్మాన్ (రజి) గారి పరిపాలనా కాలంలో ఈ రెండు బాధ్యతలను వేరు చేశారు. సైనిక బాధ్యత నిర్వహణ కోసం ఒక సైనిక అధికారిని నియమించారు. రాష్ట్ర పరిపాలనా బాధ్యతను మరొకనికి అప్పగించి అతడ్ని గవర్నరుగా చేశారు. ఇతర శాఖలలో మాత్రం హజరత్ ఉమర్ (రజి) చేసిన ఏర్పాటులను యధాతథంగా కొనసాగనిచ్చారు. వాటిలో మార్పులు చేయలేదు.

## సైనిక ఏర్పాట్లు

హజరత్ ఉమర్ (రజి) కాలంలో ఆయన చేసిన సైనిక ఏర్పాట్లను హజరత్ ఉస్మాన్ (రజి) అలాగే కొనసాగనిస్తూ వాటిని అభివృద్ధిపరిచారు. సైన్యంలో సేవచేసిన వారికి పెన్షన్ ఇవ్వబడేది. ఆ పెన్షనులో హజరత్ ఉస్మాన్(రజి) నూరేసి దిర్హములు పెంచారు. పరిపాలనా అధికార్లను, సైనిక అధికార్లను వేరుచేశారు. అర్హత కలవారిని ఉద్యోగాలలో నియమించారు.

సైనిక స్థావరాలు మొదటి నుండి నిర్ణయించబడి ఉన్నాయి. వాటికి తోడు తరాబుల్స్, సైప్రస్, తబరస్తాన్, ఆర్మీనియాలలో కూడ సైనిక స్థావరాలు ఏర్పాటు చేశారు. ప్రతి జిల్లాలో సైనిక స్థావరాలు ఏర్పాటు చేయబడ్డాయి. అక్కడ కొద్దికొద్దిగ సైన్యం ఉండేది.

గుర్రాలను, ఒంటెలను మేపడానికి పచ్చిక బయళ్ళను విస్తరింప జేశారు. కొత్త పచ్చిక బయళ్ళను కూడా ఏర్పాటు చేశారు.

పచ్చికబయళ్ళ వద్ద నీటి కొలనులను ఏర్పాటుచేశారు. ఈ గుర్రాలను, ఒంటెలను మేపేవారికి ఇండ్లు కూడ కట్టించి ఇచ్చారు.

## సర్కారు ఖజాన

హజరత్ ఉస్మాన్ (రజి) బయితుల్‌మాల్ (సర్కారు ఖజాన)ను ముస్లింల అమానతుగ తలంచేవారు. అందులోని ధనాన్ని బహు జాగ్రత్తగా ఖర్చుచేసేవారు. పన్నెండు సంవత్సరాలు ఖలీఫాగ రాజ్యాన్ని పరిపాలించారు. ఈ సుదీర్ఘ కాలంలో సర్కారు ఖజానా నుండి స్వంత ఖర్చుల కోసం చిల్లిగవ్వ కూడ తీసుకోలేదు.

హజరత్ ఉస్మాన్ (రజి) కాలంలో ఇస్లామీయ సామ్రాజ్యం సుదూర ప్రాంతాలకు విస్తరించింది. సర్కారు ఖజానాలో కూడ ధనం బాగా పెరిగింది. అందువలన హజరత్ ఉస్మాన్ (రజి) ప్రజలకు మంజూరైన పెన్షన్‌లలో నూరు దిర్హములు పెంచేశారు.

హజరత్ ఉమర్ (రజి) రమజాను నెలలో విశ్వాసుల మాతృ మూర్తులకు దినసరి భత్యం రెండు దిర్హములు, సాధారణ ప్రజలకు ఒక్కొక్క దిర్హము చొప్పున ప్రతిరోజూ సర్కారు ఖజాన నుండి ఇచ్చేవారు. దీనికి తోడు హజరత్ ఉస్మాన్ (రజి) ప్రజలకు ఆహారపదార్థాలు కూడ బయితుల్ మాల్ నుండే ఇచ్చే ఏర్పాటు చేయించారు.

బంధువుల పట్ల హజరత్ ఉస్మాన్ (రజి) ఉదారంగా మెలిగేవారు, వారికి సహాయపడే వారు. వారికయ్యే ఖర్చు తన జేబు నుండి వ్యయం

చేసేవారు. సర్కారు ఖజానపై దాని భారం వేసేవారుకారు. ఒక సందర్భంలో ఈ విషయం ఆయన చెప్పారు కూడ. "నేను నా బంధువులకు ఏదైతే ఇస్తున్నానో అది నా స్వంత డబ్బు నుండి ఇస్తున్నా, ముస్లింల అమానతును నా కోసంగాని, మరెవ్వరి కోసంగాని ఉపయోగించవచ్చని నేను భావించడంలేదు."

## క్రొత్త భవనాల నిర్మాణం

రాజ్యవిస్తరణ వల్ల క్రొత్తగా ఏర్పడిన రాష్ట్రాలలో వివిధ కార్యాలయాల కోసం క్రొత్త భవనాలు నిర్మించబడ్డాయి. ప్రజాసౌకర్యార్థం రోడ్లు వేయించ బడ్డాయి. వంతెనలు నిర్మించబడ్డాయి, మసీదులు కట్టబడ్డాయి. బాటసారుల కోసం విశ్రాంతి భవనాలు నిర్మించబడ్డాయి. కూఫా పట్టణంలో అప్పటివరకు బయట నుండి వచ్చేవారి కోసం ఎలాంటి వసతి సౌకర్యం ఉండేదికాదు. వారికి ఎంతో ఇబ్బంది కలిగేది. హజరత్ ఉస్మాన్ (రజి) వారి కోసం ఒక అతిథి గృహాన్ని నిర్మించారు.

ఖలీఫా ఉన్న రాజధాని నగరంలోని రోడ్లు విశాలంగ ఉండేవి. మదీనా రహదారుల్లో హజరత్ ఉస్మాన్(రజి) చౌకీలు ఏర్పాటు చేశారు, విశ్రాంతి భవనాలు కట్టించారు. నీటి కొలనులు నిర్మింపజేశారు. నజద్ నుండి మదీనాకు వెళ్ళే దారిలో మదీనా నుండి 24 మైళ్ళ దూరంలో ఒక మంచి విశ్రాంతి భవనాన్ని నిర్మింపజేశారు. ఒక మార్కెటు కూడ స్థాపించడమయింది. మంచి నీటి బావి త్రవ్వింపజేశారు. ఈ బావిని 'బీరుస్సాయిబ్' అని అంటారు.

ఖైబరు నుండి మదీన పట్టణానికి అప్పుడప్పుడు బ్రహ్మాండమైన వరద వచ్చేది. దీనివల్ల పట్టణానికి, నబవీ మసీదుకు ముప్పు ఉండేది. హజరత్ ఉస్మాన్ (రజి) మదీన నుండి కొద్ది దూరాన మసీదుకు సమీపంలో ఒక కట్ట కట్టించారు. కాలువ త్రవ్వించి నీటి ప్రవాహాన్ని వేరే వైపు మళ్ళించారు. ఈ కట్టపేరు 'బంద్-యె-మెహ్‌రూజ్'.

# నబవీ మసీదు నిర్మాణం

నమాజీల సంఖ్య పెరిగేకొద్దీ నబవీ మసీదు చిన్నదైపోసాగింది. నమాజు చేయడానికి ప్రజలు ఇబ్బంది పడేవారు. హజరత్ ఉస్మాన్ (రజి) ఖలీఫా కాగానే నబవీ మసీదును విస్తరింపజేసే పని చేపట్టారు. కాని మసీదు చుట్టు ఇండ్లున్న వారు ఎక్కువ నష్టపరిహారం ఇచ్చినా, వారా స్థలాలను విక్రయించడానికి తయారుకాలేదు. ఇండ్లను అమ్మి ఇతర ప్రదేశాలకెళ్ళితే నబవీ మసీదుకు దూరమవుతామని వారి విన్నపం.

హజరత్ ఉస్మాన్ (రజి) ఐదేళ్ళ వరకు ఈ ప్రయత్నం కొనసాగిస్తూ వచ్చారు. చివరకు అందులో కృతార్థులయ్యారు. వారు ఇండ్లను ఇచ్చారు, ఖలీఫా పెద్దయెత్తున నిర్మాణపు పనులు చేపట్టారు. నిర్మాణపు పనులు చేసేవారితో ఆయన స్వయంగ రాత్రింబవళ్ళు గడిపారు. 10 మాసాల కృషితో నబవీ మసీదు ఆకర్షణీయంగ, సువిశాలంగ తయారైంది. పొడవులో ఏభై గజాలు అయ్యింది. కొన్ని ఇబ్బందుల వల్ల వెడల్పు పెరగలేదు. ఈ విస్తీర్ణం హిజ్రీ శకం 29వ సంవత్సరం జరిగింది.

# ధార్మిక సేవ

ప్రియప్రవక్త (సఅసం)కు ఖలీఫా నాయిబ్; అంటే ప్రతినిధి అవుతారు. అందువల్ల ఆయన ప్రముఖ బాధ్యత దైవధర్మ ప్రబోధన. హజరత్ ఉస్మాన్ (రజి) ఈ బాధ్యతను గురించి నిరంతరం ఆలోచించేవారు. యుద్ధాలలో పట్టుబడిన ఖైదీలు వస్తే స్వయంగ వారి వద్దకు వెళ్ళేవారు. ఇస్లాంలో ఉండే బాగోగులను ప్రస్తావించి ఇస్లాం స్వీకరించమని ఆహ్వానించేవారు. ఇస్లాం స్వీకరించినవారికి ధార్మిక విద్యను బోధించేవారు. ధార్మిక శాసనాలను, పద్ధతులను తెలియపరిచేవారు.

నబవీ మసీదు నిర్మాణం గురించి మీరు తెలుసుకొన్నారు. మదీన పట్టణంలో జనాభా పెరగడం వల్ల ఒక్క అజాన్ సరిపోవటం లేదు. ఆయన మరొక అజాన్ ఇచ్చే వ్యక్తిని నియమించారు. అతను జవురా అనే స్థలంలో నిలిచి ప్రజలకు నమాజు సమయం తెలిపేవారు.

హజరత్ ఉస్మాన్ (రజి) చేసిన గొప్ప ధార్మిక సేవ దివ్యఖుర్ఆన్ ప్రచురణ. క్రొత్తగ ముస్లింలు అయినవారికి దివ్యఖుర్ఆన్ పఠనం కష్టతరమయింది. సిరియా, ఇరాఖ్, బస్రా, కూఫా ప్రాంతాల ప్రజల పఠన విధానం వివిధ రీతుల్లో ఉంది. దివ్యఖుర్ఆన్ ప్రచురణ చేయించారు. అరబ్బీ భాషలో ప్రియప్రవక్త (సఅసం) కాలంలో పఠించిన విధానంలోనే ఈ ప్రచురణ జరిగింది. ఇలా చేసి ఉండకపోయినట్లయితే ఈనాడు ఇంజీలు, తౌరాత్ వగైరా దైవగ్రంథాలకు పట్టిన గతే దీనికి కూడ పట్టేది.

# ఆయన ప్రత్యేకతలు

1. హజరత్ ఉస్మాన్ (రజి) రూపంలో, ఆకారంలో చాలా వరకు ప్రియప్రవక్త (సఅసం)ను పోలి ఉన్నారు.
2. ఆ కాలంలో ఉన్న చెడు అలవాట్లకు బాల్యం నుండే దూరంగ ఉంటూ వచ్చారు.
3. అల్లాహ్, ఆయన ప్రవక్త (సఅసం) అంటే హజ్రత్ ఉస్మాన్ (రజి) సిగ్గుపడేవారు. ఉస్మాన్ (రజి) అంటే దేవదూతలు సిగ్గుపడేవారు.
4. ఆయన సతీమణితో రెండు సార్లు హిజరత్ చేశారు.
   1. అబిసీనియాకు వలస, 2. మదీనాకు వలస.
5. ఆయనకు జున్నూరైన్ అనే బిరుదు ఇవ్వబడింది. అంటే ఆయన ప్రియప్రవక్త(సఅసం) ఇద్దరు కూతుళ్ళను ఒకరి మరణానంతరం మరొకరిని వివాహం చేసికొన్నారు.
6. ఒకే ప్రవక్తగారి ఇరువురి కూతుళ్ళను వివాహమాడిన ఆయన లాంటి మనిషి ప్రపంచంలో ఎవ్వరూ లేరు.
7. హజ్ చేసే విధానంలో ఆయన అందరికంటె ఎక్కువ పరిజ్ఞానం కలవారు.

8. ఇస్లాం స్వీకరించిన ప్రప్రథమ ముస్లింలలో ఈయన నాలుగవ వ్యక్తి. ఆయనకు ముందు ముగ్గురు మాత్రమే ఇస్లాం స్వీకరించారు.
9. సహాబీ(రజి)లందరిలో ఆయన మిక్కిలి ధనవంతులు, ఉదార స్వభావులు కూడ.
10. ఆయన బదర్ యుద్ధంలో పాల్గొనలేదు. అయినప్పటికి ఆయన బదర్ యుద్ధ వీరునిగ పరిగణించబడ్డారు.
11. ఆయన ఐశ్వర్యవంతులైనప్పటికీ ఎన్నడూ గర్వపడలేదు.
12. అనాగరిక కాలంలో ఆయన మక్కాలో ఉన్న ఐశ్వర్యవంతులలో ఒకరుగా పరిగణించబడేవారు.

## ఆయన ఇచ్చిన హితవులు

**హజరత్ ఉస్మాన్ (రజి) ఇచ్చిన మంచి మంచి హితవులు:**

➢ ఫరజ్ ఆజ్ఞను మనసార నెరవేర్చడం ఆరాధన తీపిని పెంచడమే.

➢ నిషేధిత (హరాం) వస్తువులకు దూరంగా ఉండటం వల్ల మనిషిలో దైవభీతి పెరుగుతుంది.

➢ అధికంగ మాట్లాడేవానికంటే ఆచరణ చేసేవాడు శ్రేష్టుడు.

➢ నరకం మీద విశ్వాసం కలిగి ఉండి కూడ పాపపు పనులు చేసే వ్యక్తి పట్ల ఆశ్చర్యం కల్గుతుంది.

➢ అల్లాహ్‌తో వ్యాపారం చేసేవారు ఎక్కువ లాభాన్ని సంపాదిస్తారు.

➢ దైవభయంకల ధర్మజ్ఞుడెవరంటే ఇతరులను స్వర్గీయులుగ భావిస్తాడు, స్వయంగ అల్లాహ్ విధించే శిక్షను జ్ఞాపకం చేసుకుంటూ గజగజ వణికిపోతాడు.

➢ ఎవరైతే సుదీర్ఘవయస్సు పొంది కూడ విచారణ దిన ప్రయాణం కోసం ఏమీ తయారుచేసుకోడో అతని జీవితం నాశనమైనట్లే.

- ఎవరైతే ప్రపంచాన్ని ఒక జైలుగా భావిస్తాడో అతనికి గోరి విశ్రాంతి భవనమవుతుంది.
- ఎవరి హృదయాలు పరిశుభ్రంగ ఉంటాయో, అతను ఖుర్ఆన్ గ్రంథాన్ని చదవడం లేదా వినడంలో విసుగుచెందడు.

**దైవదాస్యం అని దేనినంటారంటే...**

- అల్లాహ్ పట్ల వినయవిధేయతలు చూపడం, చేసిన వాగ్దానాన్ని నెరవేర్చడం, దొరికినదానితో తృప్తిపడడం, దొరకనిదాని విషయంలో ఓర్పు కలిగివుండడం.
- నీవు ఏదైన పాపకార్యం చేయదలిస్తే ఎక్కడైతే అల్లాహ్ ఉండడో ఆ స్థలాన్ని వెతుక్కో.
- దౌర్జన్యపరుడ్ని పొగడడం వల్ల దైవాగ్రహం వచ్చిపడుతుంది.
- స్వంత పనిని చేతులారా చేసుకొనేవాడు ఎన్నటికీ గర్వపడడు.
- దైవధర్మాన్ని విస్మరించే ముస్లిం పరాభవంపాలవుతాడు.
- దేవుడు ఇచ్చిన మంచి వనరులను వృధా చేయడమంటే ఆయనకు కృతఘ్నులయిపోవడమే.
- పాపకార్యం మనసును తప్పక వ్యాకులపరుస్తుంది.
- మంచి పనులు మంచి మనస్సుతో చేయడం వల్ల ఆరాధనలో మనోనిమగ్నత ఉంటుంది.
- ఆచరణలేని విద్య, ఉపయోగపడని ఆయుధం.
- పుణ్యకార్యాలకు ఉపయోగించని ధనం నమాజులు లేని మసీదు లాంటిది.
- మసీదులో చేయబడని నమాజులు కొరగానివి.

-: సమాప్తం :-

ఈ భూమిపై మనం ఎలా బ్రతకాలి, ఆయనిచ్చిన వస్తువుల్ని మనం ఎలా వాడాలి, వాటి విధానం కూడ మాకు తెలియజేశాడు ప్రభువు. ఈ విషయ ప్రబోధన కోసం అల్లాహ్ ప్రవక్తల్ని పంపించాడు. ప్రవక్తలు ప్రభువు గ్రంథాల్ని కూడా తెచ్చి ఇచ్చారు. ఈ గ్రంథాలలో దైవాజ్ఞలున్నాయి. జీవితం గడిపే మార్గం ఉంది. ప్రవక్తల పరంపరలో మహాప్రవక్త ముహమ్మద్(స) చివరివారు. వీరిపై దివ్యగ్రంథం ఖుర్ఆన్‌ను అవత రింపజేశాడు. మానవాళి కోసం పంపబడిన చివరి గ్రంథమిదే. ఈ గ్రంథం పొల్లుపోకుండ భద్రంగ ఉంది. అసలు రూపంలో ఉంది. దీనికంటే ముందు పంపబడిన గ్రంథాలలో ప్రజలు మార్పులు చేర్పులు చేశారు, కొన్నిటిని చిత్తు కాగితాల్లా వేస్టు చేసుకొన్నారు. కాని అల్లాహ్ స్వయంగ తన గ్రంథం ఖుర్ఆన్‌ను భద్రపరిచే బాధ్యత తీసుకొన్నాడు.

**ఇంకా ఇస్లాం మౌలిక విషయాల విస్తృత అధ్యయనానికి, అవగాహనకు చదవండి:**

# ఇస్లాం ప్రబోధిని

## 1 నుండి 4 భాగాలు

మూలం: **మౌలానా అఫ్జల్ హుసైన్** తెలుగు అనువాదం: **అబ్బాదుల్లా**

వివరాలకు:




**తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్ (రిజిష్టర్డ్)**
సందేశభవనం, లక్కడ్‌కోట్,
హైదరాబాద్-500 002. ఫోన్: 24564583